


సంపుటి: 1 సంచిక: 6 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 నవంబరు 2015

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!

సందర్శించండి: http://kottapalli.in/2015/11/welcome



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు: 9491870753

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖచిత్రం: దీపావళి

చిత్రకారుడు: వరప్రసాద్

79

# ముందుమాట

కొత్తపల్లి అడవిలో ఓ కుందేలు ఉండేది. దానికి పెద్ద పెద్ద కళ్లు, చురుకైన ఒళ్లు ఉండేవి. గెంతుతూ గెంతుతూ ఎంతదూరం పోయేదో లెక్కలేదు. దాన్ని చూసి ఎవరైనా ముచ్చటపడేవాళ్లు. వాళ్లమ్మ ఓ చిట్టి మువ్వనొకదాన్ని తెచ్చి కట్టింది, దాని మెడకి. చిట్టి కుందేలు గెంతినప్పుడల్లా ఆ మువ్వ "ఛమ్...ఛమ్"అనేది! 'ఛమ్ ఛమ్' అని ఎక్కడ వినబడ్డా, కొత్తపల్లిలో పిల్లలు "అదిగో! వచ్చింది కుందేలు పిల్ల!" అని గంతులు వేసేవాళ్లు.

కొన్ని రోజులకి ఊరంతా 'ఛమ్ ఛమ్'లయ్యాయి- తల్లులంతా వాళ్ల పిల్లల కాళ్లకి మువ్వలు తెచ్చిపెట్టారు మరి! ఊళ్లో ఎక్కడెక్కడ 'ఛమ్ ఛమ్' అని వినబడ్డా, పెద్దవాళ్ల గుండెలు కరిగేవి, పెదిమల మీద నవ్వులు విరిసేవి.



ఆ మధ్యనే ఎప్పుడో చిట్టి నెమలి ఒకటి, ఎక్కడి నుండి వచ్చిందో, వచ్చి చేరింది కొత్తపల్లిలో. దాని పింఛానికి ఎన్ని రంగులో లెక్కలేదు. నీలం, పచ్చ, ఆకాశనీలం, పసుపు, నలుపు-ఇంకా ఏమేమో రంగుల్ని మెరిపించేదది. అన్ని రంగులూ తళ తళలాడుతుంటే, వాటి నిగారింపులో ఊరంతా మునిగితేలేది. "అదిగో మెరుపు!" అని కొత్తవాళ్లు ఎవరైనా అంటే, "కాదులే, అది మా నెమలి!" అనేవాళ్లు ఊరి జనాలు.



కొన్ని రోజులకి ఊరంతా మెరుపులయ్యాయి. తల్లి తండ్రులంతా వాళ్ల పిల్లలకి రంగు రంగుల బట్టలు తొడగటం మొదలెట్టారు. ఇప్పుడిక ఊరంతా రంగులే! పిల్లలు చకచకా తిరుగుతూంటే వాళ్ల ఒంటి మీది వన్నెలు విరజిమ్మేవి. చూసే పెద్దవాళ్ల కళ్లలో మెరుపులు విరిసేవి.

అకస్మాత్తుగా ఓసారి మా గొప్ప సువాసన ఒకటి అలుముకున్నది ఊళ్లో. "ఎంత మంచి వాసన!" అని అందరూ ముక్కులు ఎగబీల్చటం మొదలెట్టారు. కొన్ని రోజులకి ఎవరో పిల్లలు

కనుక్కున్నారు- "ఇది కదిలే వాసన!" అని. 'ఊరుకోండిరా! సువాసనలు ఎందుకు కదుల్తాయి?' అన్నారు పెద్దవాళ్లు. "కాదు కాదు. ఇది మాత్రం కదిలే వాసనే!" అని పిల్లలు!

ఊరంతా అదే చర్చ అయ్యింది కొన్నాళ్ల పాటు. చూడగా అది 'పునుగు పిల్లి' పనట! ఎప్పుడొచ్చిందో, ఏంటో మరి! ఒక్క పునుగు పిల్లి ఊరంతటినీ సువాసనల్లో ముంచెత్తింది.



తర్వాత చూస్తుండగానే జనాలు రకరకాల పూలచెట్లు తెచ్చి ఇళ్లలోనూ, చేనుల్లోనూ పెంచటం మొదలెట్టారు. ఇప్పుడు గులాబీ, జాజి, మల్లెల సుగంధాలన్నీ ఊళ్ళో గాలినంతటినీ మహత్తరంగా మార్చేశాయి. ఆ పూలు పెట్టుకొని తిరిగే పిల్లలతో ఊరు ఊరంతా పరిమళించిపోయింది.

ఇట్లా పిల్లలు రంగుల్నీ, రుచుల్నీ, వాసనల్నీ, అరుపుల్నీ- ఇవన్నీ మోసుకొని ఊరంతా నింపేసరికి, నవంబరు నెల వచ్చేసింది. బడిలో పెద్దవాళ్ళు అందరూ ఒకటే ముచ్చట పడ్డారు: యీసారి పిల్లల పండగ చాలా బాగా జరపాలని.

"ఉహుఁ డబ్బుల్లేవు" అన్నారు హెడ్మాస్టరుగారు, నీరసంగా. బాలల దినోత్సవాలు జరిపేందుకని ఈమధ్య ప్రత్యేకించి డబ్బులేమీ ఇవ్వట్లేదు పైవాళ్ళు."

అందరూ నిశ్శబ్దమైపోయారు. చివరికి తెలుగు అయ్యవారు అన్నారు “అయినా పండగలు డబ్బుల్తోటి జరుగుతాయాండి? పిల్లలు, పెద్దలు మనస్ఫూర్తిగా పాల్గొంటే జరుగుతాయి గానీ?!” అని.

“ఊరికే ముందు రోజున బడినంతా శుభ్రం చేసుకొని, అలికి ముగ్గులు వేయిద్దాం! డ్రాయింగ్ అయ్యవారు వేయించిన బొమ్మలే మనకి తోరణాలు!” అన్నారు సోషల్ టీచర్.

“పిల్లలు వేసుకొచ్చే రంగురంగుల బట్టలే మతాబులు; వాళ్ల కళ్లలో సంతోషాలే వెలుగులు; వాళ్ళు సంతోషంగా పాడే పాటలే మంగళ వాయిద్యాలు" అన్నారు తెలుగు అయ్యవారు.

"అయినా అందానికి మనకేం తక్కువ?! ఊరంతా ఇంత చక్కని పూలు ఉంటేను?!” అన్నారు లెక్కల టీచరుగారు.



“పిల్లల చేత చక్కగా ఉపన్యాసాలిప్పిద్దాం, కవితలు రాయిద్దాం, పాటలు పాడిద్దాం. బానే ఉంటుంది. డబ్బుల్తో పనేంటి?!" అన్నారు ఇంగ్లీషు అయ్యవారు, సాలోచనగా.

“ప్లాస్టిక్ గ్లాసులు, తోరణాలు లేకపోతే పర్యావరణానికీ మంచిది- అవేమీ లేకపోతేనే నయంలెండి, నిజమే" అన్నారు భౌతికశాస్త్రపు అయ్యవారు.

“మీకెందుకు సార్, నామీద వదలండి. జోకులు, కథలు బాగా రాలితే, పండగ అద్భుతంగా ఉంటుంది" అన్నారు డ్రాయింగ్ సార్.

“అన్నీ బాగున్నాయి గానీ.. కొంచెం మంచి మంచి స్వీట్లు, చక్కని భోజనం ఉంటే.. “ సణిగారు ఒకరు, వెనకనుండి.

“డబ్బుల్లేవు. అవి మాత్రం కుదరవు" గుర్తుచేశారు హెడ్మాస్టరుగారు.



"పండగరోజు స్వీట్లు లేకపోతే బావుండదులెండి- అవి నావంతు! నేను తెచ్చిస్తాను" అన్నారు, అప్పటివరకూ ఏమీ అనని హిందీ టీచరుగారు.

“మరింకేం, అయితే భోజనాలు నావంతు!” అన్నారు హెడ్మాస్టరుగారు నవ్వుతూ.

ఇంకేముంది, పిల్లల పండగ మా గొప్పగా జరిగింది! ఊరు ఊరంతా ఆరోజున బళ్ళోనే!

మరి మీరూ ఏదైనా ప్లాన్ చేయండి, చూద్దాం!

బాలల దినోత్సవ శుభాకాంక్షలతో,

కొత్తపల్లి బృందం.

**బిల్లెవరిది?**

రమేష్: నిన్న రాత్రి నాకు ఒక కల వచ్చిందిరా, నువ్వు నన్ను సినిమాకు తీసుకెళ్ళావట, తర్వాత ఇద్దరం హోటల్లో భోంచేశామట!

సురేష్: అవునా?! నాకు కూడా అదే కల వచ్చిందిరా! అయితే బిల్లు మటుకు నువ్వు కట్టావట!

*సేకరణ: అలివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*



# టోపీ

పెద్ద రష్యన్ కథ

*'కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ, కాదేదీ కవితకనర్హం ' అని విన్నారా? కవితలే కాదు, కథలూనూ! ఒక 'టోపీ ' అనే భావనతో ఎంత అద్భుతమైన కథలు రాయచ్చో ఇదిగో, చూడండి!'*

*అనుసృజన – రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా*

## 1.

వసంతకాలం వచ్చింది. నులి వెచ్చని సూర్య కిరణాలను కిటికీ తెరలు ఆపలేక పోతున్నాయి. ఆరవ తరగతి గది అంతా వెలుతురు పరచుకుంటున్నది. అలాంటి వాతావరణంలో ఎవరైనా దు:ఖంగా ఎందుకు ఉంటారు? ఉపాధ్యాయిని మామూలుగా అయితే చండ శాసనురాలు. అయితే ఇవాళ్ళ ఆమె కూడా బయటకి చూస్తూ ఉంది, చివరి బెంచీల్లోని పిల్లలు చేస్తున్న అల్లరిని పట్టించుకోకుండా. రానున్న వేసవి సెలవల ఊహతో పిల్లలంతా హుషారుగా ఉన్నారు.

అయితే ఆండ్రూస్ ముఖంలో మాత్రం ఆందోళన కనిపిస్తున్నది: అతను ఒక

సమస్యలో ఇరుక్కుని ఉన్నాడు- ఆ సమస్యకి తగిన సలహాని కేవలం ఒక్క డోటాస్ మాత్రమే ఇవ్వగలడు..



సలహా కోసం అతని దగ్గరికి ఆండ్రూస్ ఇప్పటికి పది సార్లన్నా వెళ్ళి ఉంటాడు. అయినా అతను ఇతన్ని పట్టించుకోవడం లేదు... ఆ రకంగా తన విలువ పెంచుకుంటున్నాడు- అడగ్గానే సలహా ఇస్తే విలువ ఎలా వస్తుంది మరి?

బడి వదిలి పెట్టిన తర్వాత డోటాస్‌ను వదలకుండా పట్టుకున్నాడు ఆండ్రూస్. “డోటాస్! ఆగు, నువ్వు నాకు సహాయం చేయాలి! లేకపోతే మా నాన్న చేతిలో నేను చచ్చానే!" అన్నాడు బ్రతిమాలుకుంటు-న్నట్లుగా.

“సరే చెప్పు!" అన్నాడు డోటాస్.

“మా నాన్న ఇటీవల 'కిర్గీజియా' దేశానికి వెళ్ళి వచ్చాడు. ఆ దేశం వెళ్ళడానికి రైలులో నాలుగు రోజుల ప్రయాణం. మా నాన్న విమానంలో వెళ్ళాడనుకో, అయితే మా నాన్న కిర్గీజియా నుండి వస్తూ ప్రత్యేకమైన టోపీ ఒక దాన్ని తెచ్చాడు! అది నల్లగా, నలుచదరంగా ఉంది! దాని చుట్టూ తెల్ల సిల్కు లేసు కుట్టి ఉంది! దాన్ని ఆ దేశంలో 'పుర్రెటోపీ' అంటారట- మా నాన్న చెప్పాడు. మా ఇంట్లో అందరికీ దాన్ని చూపించి, ఆ తర్వాత దాన్ని భద్రంగా బీరువాలో పెట్టాడు. మా నాన్నకి టోపీలు సేకరించే అలవాటుంది. అవంటే ఆయనకు చాలా ఇష్టం. మా బీరువాలో వివిధ దేశాలనుండి తెచ్చిన టోపీలు ఎన్నో ఉన్నాయి-" అని ఆగాడు.

“అయితే ఇప్పుడు నీ సమస్యేమిటి?" అడిగాడు డోటాస్.

“ఆ టోపీ భలే ఉంది. దాన్ని మీకందరికీ

చూపించాలనిపించింది నాకు. దాంతో మా ఇంట్లో ఎవరికీ తెలియకుండా ఆ టోపీని తీసుకున్నాను, బీరువా లోంచి. దాన్ని నా తల మీద పెట్టుకుంటే ఎలా ఉంటానో చూసుకోవాలనిపించింది, దారిలో.



'సరే' అని నది దగ్గరకు పోయానా, తల వంచి చూస్తుండగానే టోపీ జారి నీళ్ళల్లో పడిపోయింది!" అన్నాడు ఆండ్రూస్.

ఆ మాట చెప్తుంటే వాడి కళ్ళల్లోకి నీళ్ళు వచ్చేసాయి!

"ఆ తర్వాత?" అన్నాడు డోటాస్.

"నీకు తెలుసు కదా, ఆ నది ఎంత వేగంగా ప్రవహిస్తుందో? టోపీ నీళ్ళల్లో పడిందో లేదో, కన్ను మూసి తెరిసేలోగా అది కాస్తా కొట్టుకుపోయింది!" మూలిగాడు ఆండ్రూస్.

"మరి ఇంటి దగ్గర ఈ విషయం ఎవరికీ చెప్పలేదా?" అన్నాడు డోటాస్.

"అమ్మో! చెప్తే ఇంకేమైనా ఉందా?" అన్నాడు ఆండ్రూస్. భయంతో వాడి మూలుగు ఆగిపోయింది.

"అయితే ఇప్పుడేం చేద్దామను-కుంటున్నావు?"

"అది తెలియకేగా, నిన్ను ఇబ్బంది పెడుతున్నది? ఇదిగో, ఈ తపాలా బిళ్ళ తీసుకుని ఏదైనా సలహా ఇవ్వు!" అని ఓ పాత తపాలా బిళ్ళని డోటాస్ చేతికిచ్చాడు ఆండ్రూస్.

ఒక సలహాకు ఒక తపాలా బిళ్ళ తీసుకుంటాడు డోటాస్. వాడు దాన్ని పరీక్షగా చూసి "ఇది చిరిగిపోయింది" అన్నాడు.

"నేను చూడలేదులే, అయినా ఇదేనా ఏంటి, ఇంకా చాలా తపాలా బిళ్ళలు ఇస్తాను- నువ్వు నన్ను ఈ ఆపద నుండి

కాపాడితే!" అన్నాడు ఆండ్రూస్, కంగారుగా.

డోటాస్ తల పంకించాడు. ఆలోచిస్తూ అటూ ఇటూ నడవసాగాడు. "పుర్రెటోపీ! పుర్రెటోపీ!" అనుకోసాగాడు. అది మంచి శకునం. అందరూ అంటారు- 'డోటాస్ అలా అనుకుంటూ నడుస్తున్నప్పుడు అతని బుర్ర పాదరసంలా పని చేస్తుంది' అని. ఆ సంగతి విని ఉన్నాడు కనుక ఆండ్రూస్ అతన్నే చూస్తూ ఉబలాటపడుతున్నాడు.

కాసేపు అలా తిరిగిన డోటాస్, ఆండ్రూస్ వైపు చూస్తూ- "సరే- కిర్గీజియా రాజధాని ఏంటో మీ నాన్నని అడిగి తెలుసుకో. ఆ తర్వాత అక్కడ ఎన్ని బడులు ఉన్నాయో అడుగు. అతనికి ఏ మాత్రమూ అనుమానం రానీయకు సుమా! మామూలుగా తెలుసుకోవడం కోసం అడుగుతున్నట్లు అడిగి తెలుసుకో. వెళ్ళు-వెళ్ళి, రేపు ఈ సమాచారంతో తిరిగి రా!" అన్నాడు.

“ఇంతేనా?” అని నిరాశపడ్డాడు ఆండ్రూస్.

“ఇప్పటికి ఇంతే. తర్వాత ఏం చేయాలో నువ్వు ఈ సమాచారం తెచ్చాక చెప్తాను" అన్నాడు డోటాస్.

ఆండ్రూస్ ఇంటికి పరుగుతీశాడు.

**2.**



ఆ రాత్రి తండ్రి ప్రక్కనే పడుకుని ఆయన్ని చిన్నగా మాటల్లోకి దించాడు ఆండ్రూస్.

"నాన్నా, పోర్చుగల్ రాజధాని ఏది?” అడిగాడు, నేరుగా కిర్గీజియా గురించి అడగకుండా.

“లిస్బన్" అన్నాడు తండ్రి.

“ఓ, అయితే ఇస్టోనియా రాజధాని?”

“టాలిన్"

“అవును నాన్నా, నేను మర్చిపోయాను. మరి కిర్గీజియా రాజధాని ఏమిటి?” అడిగేసాడు.

“ఫ్రంజే" అన్నాడు తండ్రి. కుమారుడు అలా అన్ని విషయాలూ అడిగి తెలుసుకుంటున్నందుకు అతనికి చాలా సంతోషంగా ఉంది.

“ఫ్రంజే, ఫ్రంజే, ఫ్రంజే" అని చాలా సేపు మననం చేసుకున్నాడు ఆండ్రూస్- మర్చిపోకుండా ఉండటానికి.

“అయితే మిస్బన్ లో ఎన్ని పాఠశాలలు ఉంటాయి?”

“మిస్బన్ కాదు, లిస్బన్- అది పోర్చుగల్ రాజధాని" అని, "ఏమో, చాలా పాఠశాలలు ఉంటాయి" అన్నాడు తండ్రి.

"అయితే మరి ఫ్రంజేలో ఎన్ని ఉంటాయో తెలుసా, సుమారుగా?” అడిగాడు.

“ఆఁ..ఓ ముప్ఫై ఐదు నలభై ఉండొచ్చు" అన్నాడు నాన్న.

“సరే నాన్నా, నిద్రొస్తోంది" అన్నాడు ఆండ్రూస్ కళ్ళు మూసుకుని.

“నువ్వు ఇలా ప్రశ్నలడగడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఇంకా ఏమైనా సందేహాలుంటే రేపు అడుగు" అన్నాడు నాన్న అమాయకంగా.

సరేనని తల ఊపి నిద్రలోకి జారాడు ఆండ్రూస్- "ఫ్రంజే, ఫ్రంజే, ముప్ఫై ఐదు-నలభై" అనుకుంటూ.

## 3.

మరునాడు ఉదయాన్నే డోటాస్ దగ్గరకి వెళ్ళి తండ్రి చెప్పిన విషయాలు చెప్పాడు ఆండ్రూస్.

ఇవ్వవలసిన సలహా గురించి డోటాస్ కి ఇంకా స్పష్టమైన అవగాహన రాలేదులా ఉంది; మళ్ళీ అటూ ఇటూ తిరగటం మొదలు పెట్టాడు.

హఠాత్తుగా ఆండ్రూస్ వైపు తిరిగి "హాజరు పట్టీలో నీ సంఖ్య ఎంత?” అని అడిగాడు.

“పదిహేను" అన్నాడు ఆండ్రూస్- 'హాజరు పట్టీలో సంఖ్య ఎందుకు, ఇప్పుడు? జాతకం చెప్తాడా ఏమిటి?' అనుకుంటూ.

“ఆఁ బాగుంది. ఇప్పుడు ఇంక నువ్వు -ఫ్రంజే నగరంలో-ఆరో తరగతి చదివే-

పదిహేనో సంఖ్యగల పిల్లవాడికో, పిల్లకో- ఉత్తరం రాస్తావు"

"ఎందుకు? ఏమని?" అన్నాడు ఆండ్రూస్, ఏమీ అర్థం కానట్లు ముఖం పెట్టి.



"జాబుతో బాటు మన బడి వార్షిక నివేదిక కూడా పంపు. నువ్వు పుర్రెటోపీని పోగొట్టుకొని చిక్కుల్లో పడిన విషయాన్ని రాసి, వాళ్ళని ఒక పుర్రెటోపీ పంపమని అడుగు" చెప్పాడు డోటాస్.

"ఓ, అదా!" అంటూ ఆండ్రూస్ ఆశ్చర్యపోయాడు. 'ఎంత తెలివైన ఆలోచన! ఎంత సులభమైన ఉపాయం! నా బుర్రకు ఈ ఆలోచన రాలేదు ఎందుకని?' అనుకుంటూ సిగ్గు పడ్డాడు.

"ధన్యవాదాలు డోటాస్, చాలా మంచి ఉపాయం చెప్పావు" అని పొగిడాడు.

అయితే డోటాస్ పచార్లు చేయడం ఆపలేదు ఇంకా. ఆలోచిస్తున్నట్లుగానే ఉంది అతని ముఖం- "ఊc.. నువ్వు ఒక్క జాబు మాత్రమే రాస్తే సరిపోదు, సమాధానం రాకపోవచ్చు. కాబట్టి ఫ్రంజేలోని నలభై పాఠశాలలకీ రాయాలి" అన్నాడు.

"నలభై ఉత్తరాలు రాయమంటావా?"

"నలభై కాదు- మన బడిలో ఆరో తరగతిలో నాలుగు సెక్షన్ లు ఉన్నాయి కదా, ప్రతి సెక్షన్‌లోనూ ఒక పదిహేనో నంబర్ ఉంటుంది. అలా అక్కడ కూడా, నలభై పాఠశాలల్లోనూ పదిహేనో నంబర్ ఉన్న ఆరో తరగతి వాళ్ళు నలుగురు ఉంటారు. అంటే నువ్వు మొత్తం నూట అరవై జాబులు రాయాలన్నమాట. అందులో కనీసం ఇద్దరన్నా నీకు పుర్రె టోపీ పంపిస్తే బావుండు- ఒకటి నేను తీసుకోవచ్చు" అన్నాడు డోటాస్.

"అది నువ్వు అడగాలా? రెండు పుర్రె టోపీలు వస్తే తప్పకుండా నీకు ఒకటి

ఇస్తాను" అన్నాడు ఆండ్రూస్. అంటూనే పనిలోకి దిగేసాడు. తన నోటు పుస్తకంలోని పేజీలను విడివిడిగా చింపి, ఒక పేజీలో ఇలా రాశాడు -

*ప్రియమైన అపరిచిత స్నేహితుడా,*

*నీ పేరు ఏంటో నాకు తెలియదు. అయితే మనిద్దరం మన బడుల హాజరు పట్టీలో పదిహేనో సంఖ్య గల పిల్లలం. ఆ సంబంధంతో నీకు వ్రాస్తున్నాను.*

*నాకు ఒక కష్టం కలిగింది. మా నాన్న మీ దేశం నుండి నల్ల నలుచదరపు ఫ్రెంచి టోపీ ఒకదాన్ని తెచ్చాడు. దాని చుట్టూ తెల్లని లేసు కుట్టి ఉంది. అయితే నేను దానిని ప్రమాదవశాత్తూ మా ఊరి నదిలో పోగొట్టుకున్నాను. నాన్నకి ఇంకా ఈ విషయం తెలియదు. తెలిస్తే నాకు బాగా దెబ్బలు పడతాయి.*

*కనుక దయతో నాకు నువ్వు ఒక ఫ్రెంచి టోపీని పంపించగలవు. మా బడి వార్షిక నివేదిక కాపీని ఒకదాన్ని నీకు పంపిస్తున్నాను. దానిలో నా అడ్రస్ ఉంది. దయచేసి ఈ విషయాన్ని ఇతరులకెవరికీ తెలియనివ్వకు. ఇప్పటికి ఇంతే సంగతులు. శుభాకాంక్షలతో*

*నీ స్నేహితుడు*

*ఆండ్రూస్*

ఉత్తరం డోటాస్ కి చూపించాడు. "ఆఁ బాగుంది, అయితే దీనికి ఒక వాక్యం కలుపు - 'మా బడి యువక బృందం ప్రతినిధి 'డోటాస్' మీకు గౌరవ వందనాలు తెలుపుతూ, మీతో పరిచయానికి సంతోషిస్తున్నాడు' అని జోడించు" అన్నాడు డోటాస్.



పాపం ఆండ్రూస్ ఆ వాక్యం కూడా కలిపి, మొత్తం 160 ఉత్తరాలు రాసి పోస్ట్ చేశాడు. అన్ని ఉత్తరాలు రాయడానికి అతనికి మూడు రోజులు పట్టింది.

ఒక వారం గడిచింది. రెండు వారాలు

గడిచాయి. ఏమీ సమాధానం రాలేదు. ఆండ్రూస్ వాళ్ళ నాన్న వ్యాపారం పని మీద వేరే ఎక్కడికో వెళ్ళాలనుకుంటున్నాడు- 'వెళ్ళేముందు బీరువా తెరుస్తాడు. పుర్రెటోపీ లేని సంగతి గమనిస్తాడు. ఎలాగ?' అనుకుంటూ కాలు గాలిన పిల్లిలాగా డోటాస్ చుట్టూ తిరుగుతున్నాడు ఆండ్రూస్.

"ఉండు ఉండు, సమాధానం వస్తుంది" అంటునే ఉన్నాడు డోటాస్ నిబ్బరంగా.

## 4.

ఆ రోజున తరగతి గదిలోకి రాగానే టీచర్ అన్నది- "ఆండ్రూస్- నీ కోసం ఏదో పార్సిల్ అనుకుంటాను, ఒకటి వచ్చింది. విశ్రాంతి గదిలో ఉంది- తెచ్చుకో" అని.

గుండె దడదడలాడుతుండగా లేచి వెళ్ళాడు ఆండ్రూస్, డోటాస్ వైపు ఆందోళనగా చూస్తూ. ఊదారంగు కాగితంలో చుట్టిన పార్సిల్ ఒకటి ఉన్నది అక్కడ. దాన్ని తీసుకుని బయటకి వచ్చి, గబ గబా విప్పి చూశాడు. లోపల - పుర్రెటోపీ! అచ్చు నాన్న తెచ్చినటువంటిదే. అద్భుతం! లోపల ఒక జాబు కూడా ఉంది:

ప్రియమైన ఆండ్రూస్,

నీ జాబు అందుకున్నాను. చాలా సంతోషం. మీ బడి వార్షిక నివేదిక నాకు నచ్చింది. నీ కోసం ఒక పుర్రెటోపీ కొని పంపుతున్నాను. దూరంగా ఉన్న నీతో స్నేహం చేయడం నాకు చాలా సంతోషంగా ఉంది. మీ దేశాన్ని గురించి, మీ అలవాట్ల గురించి విన్నాను. నేను చనిపోయిన సీతాకోక చిలుకలని సేకరిస్తుంటాను. నీకు దొరికితే వాటిని అగ్గిపెట్టెలో పెట్టి పంపు"

ఇట్లు

అసన్

ఆండ్రూస్ దాన్ని తీసుకుని తరగతి గదిలోకి వచ్చాడు నవ్వు మొహంతో. డోటాస్ చూపులలో గెలిచిన గర్వం కనిపించింది.

తర్వాతి రోజున నాలుగు పార్సిళ్ళు వచ్చాయి- అన్నీ పుర్రెటోపీలే.

తర్వాత రోజున ఆరేడు వచ్చాయి!

ఇప్పుడు వాటిని విప్పేందుకు కూడా ఆసక్తి పోయింది ఆండ్రూస్కు. వాటి లోపల ఏమి

ఉండేదీ, చూడకనే చెప్పచ్చు కదా!

వాటిల్లో ఒక పార్సిల్‌ని పూర్తిగా డోటాస్‌కి ఇచ్చేసాడు. మిగిలిన వాటిని తన అల్మైరాలో సర్దుకున్నాడు.

తర్వాతి రోజున మళ్ళీ పార్సిళ్ళు వచ్చాయని టీచర్ చెప్పింది- వెళ్ళి తెచ్చుకున్నాడు.



ఆ మరుసటి రోజున తరగతి గదిలోకి వచ్చిన టీచర్ "ఆండ్రూస్, ఈరోజు నీకు దాదాపు యాభై పార్సిళ్ళు వచ్చాయి. ఆశ్చర్యంగా ఉందే, ఎవరు పంపిస్తున్నారు?" అంది.

"నా పుట్టినరోజు సందర్భంగా స్నేహితులు పంపిస్తున్నారు టీచర్" చెప్పేసి, ఇంక ఆమెకి తన ముఖం చూపించడం ఇష్టం లేనట్లు గబగబా విశ్రాంతి గదికి వెళ్ళాడు ఆండ్రూస్.

అక్కడ బల్ల నిండా పార్సిళ్ళు కుప్ప పోసి ఉన్నాయి.

'వీటన్నిటినీ మోసుకుపోయేదెలాగ? ఏం చేయాలి, ఎక్కడ దాచాలి?' అని ఆండ్రూస్ తికమక పడ్డాడు. అతని పరిస్థితి పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్లు అయింది.

'ఇదంతా డోటాస్ తప్పు. ఒక జాబు రాస్తే పోయేదానికి నూట అరవై రాయించాడు!' అనుకునేసరికి అతనికి చాలా కోపం వచ్చింది. ఆ పార్సిళ్ళన్నిటినీ తెచ్చి తమ తరగతి గదిలోనే, ఓ మూలన కుక్కాడు.

పిల్లలందరూ ఆండ్రూస్ వైపుకు వింతగా చూస్తున్నారు. భోజనాల సమయంలో ఆండ్రూస్ డోటాస్ దగ్గరికి వెళ్ళి, గుసగుసగా- "ఇదంతా నీ వల్లే.. ఇప్పుడు గనక ప్రధానోపాధ్యాయుడు అడిగితే నీ మీదే చెప్తాను" అన్నాడు.

డోటాస్ వీడివైపుకొక చూపు విసిరి,

పట్టించుకోకుండా వెళ్ళిపోయాడు.

**5**.

ఆండ్రూస్ ముఖం వేళ్ళాడేసుకుని టోపీలన్నింటినీ బ్యాగ్‌లోను, తన వానకోటులోను కుక్కి, గోతాం లాగా ఇంటికి మోసుకు వెళ్ళాడు.



ఆ మూటను ఇంటి గోడ ప్రక్కన పెట్టి, తలుపు తట్టాడు. వాళ్ళమ్మ తలుపు తీసి, ఎప్పటిలాగానే వంటింట్లోకి వెళ్ళింది. ఆమె అటు వెళ్ళాక, ఆండ్రూస్ మూటను మెల్లగా తన గదిలోకి చేర్చి, ఒక్కొక్క పార్సిలునూ విప్పి చూసుకున్నాడు. ప్రతి పార్సిల్‌లోనూ ఒక పుర్రెటోపీ ఉంది; స్నేహం కోరుతూ ఉత్తరం ఉంది.

ఒక పార్సిల్ లో మాత్రం ప్రత్యేకంగా తయారు చేయబడ్డ ఊలు టోపీ ఒకటి ఉంది. ఆ టోపీతో వచ్చిన జాబుని తీసి చదవసాగాడు ఆండ్రూస్.

ప్రియమైన ఆండ్రూస్,

నీ ఉత్తరం నాకు అందింది. నీకు వచ్చిన కష్టానికి నేను చాలా బాధ పడ్డాను. అయితే నీకు టోపీ కొనడానికి నా దగ్గర డబ్బులు లేవు. మేము చాలా పేదవాళ్ళం. నా తండ్రి కారు ప్రమాదంలో మరణించాడు. నా తల్లి కర్మాగారంలో పని చేస్తుంది. నాకు తొమ్మిది మంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఉన్నారు. మమ్మల్ని సాకడానికే మా అమ్మ చాలా కష్టపడుతోంది. అయితే నీ ఉత్తరం వచ్చినప్పటి నుండి నీకు సహాయం చేయలేకపోయానే అని నాకు చాలా దిగులు కలిగింది.

నా దిగులు తీర్చడానికేనేమో అన్నట్లు మా అత్త ఊరి నుండి మమ్మల్ని చూడటానికి వచ్చింది. తిరిగి వెళ్ళేటప్పుడు ఏడో తరగతి పాఠ్య పుస్తకాల కోసం

నాకు కొంత డబ్బు ఇచ్చింది. ఆ డబ్బుతో ఊలు కొని, మా అక్కల సాయంతో టోపీ అల్లి నీకు పంపేప్పటికి ఆలస్యం అయ్యింది.

'అయ్యో, పుస్తకాలు కొనుక్కోకుండా నాకు టోపీ పంపిందే' అని అనుకోకు. నేను ప్రతి ఏడాదిలాగే ఇప్పుడు కూడా నా స్నేహితుల పుస్తకాల్లోనుండి పాఠాలు రాసుకుని చదువుకుంటాను- అది నాకు మంచిది కూడా.

నీకు ఈ టోపీ నచ్చిందా? అందగానే ఉత్తరం రాస్తావు కదా?

శుభాకాంక్షలతో,

ఐగుత్

అది చదివిన ఆండ్రూస్‌కి చాలా బాధ వేసింది. 'పాపం, ఐగుత్!' అనిపించింది. 'ఈ పాపం అంతా నాది కాదు- ఆ డోటాస్ దే. వాడి పని చెబుతాను' అని తిట్టుకుంటూ మిగిలిన పార్సిళ్ళు విప్పి చూడసాగాడు.

ఆ పార్సిళ్ళ మధ్య అతనికి ఒక ఉత్తరం కనిపించింది:

ప్రియమైన స్నేహితుడా!

నన్ను క్షమించు. నేను నీకు టోపీ పంపలేక పోతున్నాను. తప్పు నాది కాదు. ఏ అంగడిలోనూ నువ్వు అడిగిన టోపీ లేదు. గత పది రోజుల్లోనే అన్నీ అమ్ముడు పోయాయిట. అది మనిద్దరి దురదృష్టం. ఆ నల్లరకం టోపీ కాకుండా మరేదైనా పంపమంటే పంపిస్తాను. ఏ విషయమూ నాకు రాయి.

శుభాకాంక్షలతో

ఇవాన్

అన్నీ చదివేసాక ఆండ్రూస్ టోపీలన్నిటినీ ఓ అట్టపెట్టెలో పెట్టి, తన మంచం క్రింద దాచాడు. ఇక ఆరోజు రాత్రి వాడికి ఎంతకీ నిద్ర పట్టలేదు. ఎంత సేపటికీ తనకు తెలీని ముఖాలు- ఇవాన్, ఐగుత్, అసన్, ఇంకా ఎవరెవరో వచ్చి తనతోటి ఇష్టంగా మాట్లాడుతూ కనిపించారు. తను మాత్రం వాళ్ళకేసి కన్నెత్తి కూడా చూడలేక- పోతున్నాడు.

తర్వాతి రోజున ఆ ఉత్తరాలన్నీ తీసుకెళ్ళి డోటాస్‌కి చూపించి 'మళ్ళీ ఏదైనా సలహా ఇవ్వు' అని బ్రతిమిలాడాడు ఆండ్రూస్.

అన్నీ చదివాక పెద్దగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు తప్ప, ఇంకేమీ సలహా ఇవ్వలేదు డోటాస్. ఆండ్రూస్‌కి వాడిని తన్నాలన్నంత కోపం వచ్చింది.

మర్నాడు ప్రధానోపాధ్యాయుడు ఆండ్రూస్‌ని పిలిచాడు. ఆయన బల్ల మీద ఇంకొక పెద్ద

పార్సిళ్ళ కుప్ప ఉంది. ఆయన ఆ కుప్పలోంచి తల బయటకి పెట్టి "ఏంటి ఇదంతా? ఫ్రంజే నుండి ఎవరు, ఏమిటి పంపుతున్నారు?' అన్నాడు.



ఆండ్రూస్ తలవంచుకుని పాదాల వైపు చూసుకుంటూ కథ మొత్తం వివరించాడు ఆయనకి.

“లోకంలో ఎవరైనా 160 జాబులు రాస్తారా? ఒక జాబు చాలదా, పోనీ రెండు! అయినా జరిగిన విషయం మీ ఇంట్లో వాళ్ళకి చెప్పకుండా ఇలా ఎందుకు చేయడం?” అన్నారు ప్రధానోపాధ్యాయులు.

“డోటూస్‌తో నేనన్నాను కూడా సర్, 'రెండు చాలవా?' అని! అయినా వాడు 'నూట అరవై రాయాల్సిందే!' అని పట్టు పట్టాడు. నాకు ఆ ఉత్తరాలన్నీ రాయడానికి మూడు రోజులు పట్టింది. బొటన వేలు, చూపుడు వేలు- పేజీని తాకి తాకి ఆఖరికి చిటికెన వేలుకి కూడా, కాయలు కాచాయి!" అన్నాడు ఆండ్రూస్ ఉక్రోషంగా.

పెద్దాయన ఆండ్రూస్ మాటలకి పగలబడి నవ్వారు. ఆండ్రూస్ తల సిగ్గుతో మరింత వాలిపోయింది.

“సరే, డోటూస్ తనకు తోచిందేదో చెప్పాడే అనుకో, మరి నీ తెలివి ఎక్కడికి పోయింది? నీకు బుర్రలేదా? వాడికంటే పొడుగ్గా ఉన్నావు, తరగతిలో అందరికంటే బాగా చదువుతావు, ఇంకొన్ని రోజుల్లో పై తరగతికి వెళుతున్నావు?!" అన్నారు.

“క్షమించండి" అన్నాడు ఆండ్రూస్.

ఇద్దరూ కలిసి పార్సిళ్ళు విప్పారు. వాటిల్లో కూడా టోపీలు, స్నేహం కోరుతూ ఉత్తరాలు ఉన్నాయి.

"వాటిని తీసుకుని పద!" అని ఆయన ఆండ్రూస్‌ని వెంటబెట్టుకుని తరగతి గదిలోకి వచ్చాడు.

**6.**

ప్రధానోపాధ్యాయుడి కనుసైగతో టీచర్ బయటికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిందాకా ఆగి, ఆయన ఆండ్రూస్ చేతిని టోపీలతో సహా ఎత్తి డోటాస్ వైపుకి చూపిస్తూ అన్నారు- "ఓ గొప్ప సలహాదారుడా! నీ తెలివి ఇప్పుడు ఏం సలహా ఇవ్వబోతున్నదో చెప్పు?! ఇంతకీ నీకు అర్థం అయ్యిందా, నేను ఏ విషయం గురించి అడుగుతున్నానో?!" అని.

"అవును అర్థం అయింది!" అన్నాడు డోటాస్, 'దొరికిపోయాను' అనుకుంటూ.

'డోటాస్ చిక్కులో పడ్డాడు!' అనుకున్నారు పిల్లలందరూ.

'అడుగుతుంటే వారం రోజుల నుండీ తప్పించుకు తిరుగుతున్నాడు, ఇప్పుడు ఇరుక్కుపోయాడు. ఏం చెప్తాడింక?!' అని సంతోషాన్ని గొంతులోనే కుక్కుకుని నిలబడ్డాడు ఆండ్రూస్.

డోటాస్ కిటికీ గుండా కాసేపు బయటకి చూశాడు...

ఎండిన ఆకులన్నీ రాలిపోయాక, చెట్లు ఇప్పుడిప్పుడే లేత చిగుళ్ళని వేస్తున్నాయి. సూర్యుడు పడమటిదిక్కుకి సాగిపోతుంటే భూమి మీద నీడలు పరుచుకుంటున్నాయి.



పిల్లలు, ప్రధానోపాధ్యాయుడు, అందరూ నిశ్శబ్దంగా డోటాస్ వైపే చూస్తున్నారు.

బయటికి చూస్తున్న డోటాస్ మెల్లగా నవ్వాడు. అతనికి ఏదో ఆలోచన తట్టినట్లుందని అందరూ ముందుకు వంగి ఆత్రంగా అతని వైపుకి చూసారు-

అతను లేచి నిలబడి, జేబులోంచి ఐగుత్ రాసిన ఉత్తరాన్ని తీసి, పెద్దగా చదివాడు. అతను దాన్ని చదవటం పూర్తి చేసే సరికి పిల్లలందరూ మరింత నిశ్శబ్దంలోకి జారిపోయారు. కొంతమందికైతే కళ్ళల్లోంచి

నీళ్ళు కూడా కారాయి!

ఇంతలో డోటాస్ స్థిరమైన గొంతుతో అన్నాడు- "ఈ టోపీలన్నిటినీ మనం కొనుక్కుందాం! వచ్చిన డబ్బుతో ఐగుత్‌కి ఏడో తరగతి పాఠ్యపుస్తకాలు కొని పంపుదాం!" అని.

పిల్లలందరూ చప్పట్లు కొడుతుంటే ప్రధానోపాధ్యాయులవారు మనసులో 'నాకీ ఆలోచన రాలేదే?!' అనుకున్నారు. డోటాస్ భుజం మీద చెయ్యి వేసి "నువ్వు చాలా తెలివిగల వాడివోయ్, చాలా దయగల అబ్బాయివి కూడా" అన్నారు నవ్వుతూ.

"ఎంత చిన్న విషయం, కదా?! నేనేమిటో, ఎప్పుడూ చదువులోనే పడి కొట్టుకుపోతుంటాను. ఇట్లాంటివి నా బుర్రకి తట్టవెందుకో! అందుకేగా, అందరూ డోటాస్‌ని సలహాలు అడిగేది?!' అనుకున్నాడు ఆండ్రూస్. 'టోపీలన్నీ వదిలి పోతాయి' అనుకోగానే గుండెల మీద నుంచి ఒక్కసారిగా పెద్ద బరువు దిగిపోయినట్లనిపించిందతనికి.

డోటాస్ దగ్గరకి వెళ్ళి "భలే ఆలోచన! నేనిప్పుడే ఐగుత్‌కి ఉత్తరం రాస్తాను" అన్నాడు.

"వద్దు- ముందస్తుగా ఉత్తరం రాయకు. ఈ వారాంతానికల్లా మనందరం కలిసి తనకి నేరుగా పుస్తకాలే పంపిద్దాం. అట్లా ఆమె ఒక్కసారిగా ఆశ్చర్యపోతే ఎంత బావుంటుందో కదా?!" అన్నాడు డోటాస్.

"కదా!" అన్నాడు ఆండ్రూస్ - పుస్తకాలు అందుకున్నప్పుడు ఐరిస్‌కి కలిగే ఆశ్చర్యం అంతా తనకే కలిగినంత ఆనందంగా నవ్వుతూ.



**ఎర్లీ బర్డ్!**

జడ్జి: పోలీసులు నిన్ను ఎందుకు అరెస్ట్ చేశారు బాబూ?

దొంగ: అదే అర్థంకావట్లేదు సర్! ఉదయం తొందరగా షాపింగ్ చేస్తే అరెస్టు ఎందుకు సార్?!

జడ్జి: ఉదయం ఎంత ఎర్లీగా చేశావు నాయనా, షాపింగు?

దొంగ: జస్ట్ షాప్ ఓపెన్ కావడానికి ముందు చేశాను సర్!

*సేకరణ: అళివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*



# దురాశ

జానపద కథ

*కథనం: సిద్ధార్థ, మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల, పూజారివారి పల్లి, చిత్తూరు జిల్లా.*

అనగనగా ఒక ఊళ్లో నలుగురు అన్నదమ్ములు ఉండేవాళ్ళు. శివయ్య, రంగయ్య, రామయ్య, వరదయ్య- వీళ్లకు నలుగురికీ విపరీతమైన డబ్బు ఆశ. 'కష్టపడకుండా డబ్బులు సంపాదించడం ఎలా?' అనే, వాళ్ళు ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాళ్ళు.

అదే ఊళ్లో ఒక ముసలి మంత్రాల అవ్వ ఉండేది. అవ్వకు వాళ్లంటే చాలా మంట- నిజానికి అవ్వకు వాళ్లంటే ఇష్టమే; వాళ్ల బుద్ధంటేనే రోత. చూసి చూసి, 'ఎలాగైనా వాళ్ల డబ్బు ఆశని వదిలించాలి' అని, అవ్వ ఓ పథకం వేసింది.

ఒకరోజు రాత్రి అన్నదమ్ములు నలుగురూ నడుచుకుంటూ పోతున్నారు. ముసలి అవ్వ వాళ్ళకు కనిపించకుండా ఒక చెట్టు క్రింద దాక్కొని, బొంగురు గొంతుతో పాడింది-

"*అడవి అంచున ఉన్నది పరమ శివుని గుడి*
*అక్కడ దాగున్నది మరి- అంతులేని పసిడి*

*వెతికితేనే కదా, అది దొరికేది?*

*ఊరికే ఆశపడితే ఏమౌతుంది మరి?!*" అని.

అది విని టక్కున ఆగారు వాళ్లు.

"ఎవరురా, పాడేది?" అని ఆ చుట్టుప్రక్కలంతా వెతికారు.

అయితే అక్కడ ఎవరూ కనబడలేదు. చెట్టు క్రింది తొర్రలో దాక్కొని ఉంది అవ్వ.

కానీ వాళ్లకు పాట అర్థం అయితే అయ్యింది. డబ్బు ఆశవాళ్లని ఇక ఆలోచించనివ్వలేదు. తొందర తొందరగా నిర్ణయించుకున్నారు: "ఇప్పటికి ఇంటికి వెళ్తాం; రేపు ఉదయాన్నే బయలుదేరి అడవి అవతలి ప్రక్కన ఉన్న పాడు బడ్డ గుడికి పోతాం" అని.

గుడిలో త్రవ్వటం కోసం కావలసిన సామగ్రి అంతా సర్దుకున్నారు వాళ్ళు. "ప్రక్క ఊరికి పని మీద వెళుతున్నాం!" అని ఇంట్లో చెప్పి బయలుదేరారు.

అడవిలో పోతూ ఉంటే అన్నదమ్ములకి బాగా ఆకలైంది. వెంట తెచ్చుకున్న తిను బండారాలేవో తిన్నారుగానీ, అవి ఒక పంటి క్రిందికి కూడా చాలలేదు. తిన్నాక నలుగురికీ విపరీతమైన నిద్ర వచ్చింది. "ఇక్కడ కొంచెం విశ్రాంతి తీసుకుందాం; ఒక్క అర్థగంట" అని నలుగురూ తలా ఒక చెట్టు క్రింద ఒరిగారు. లేచి చూసుకునే సరికి ఏముంది, తెచ్చుకున్న సామగ్రి అంతా మాయం!



నలుగురూ ఉత్తి చేతులతో వెనక్కి తిరిగి వచ్చారు. కానీ పట్టుదలకొద్దీ మరుసటి రోజున మళ్లీ బయలుదేరారు. ఈసారి ఇంకొంచెం ఎక్కువ తిండి తీసుకెళ్ళారు. "మధ్యలో ఎక్కడా నిద్ర పోకూడదు" అనుకున్నారు. అయితే ఈసారి అన్నం తినగానే వాళ్ళకు బాగా దాహం వేసింది. త్రవ్వకానికి కావలసిన సామాన్లన్నీ అక్కడే ఓ చెట్టుకు తగిలించి, నీళ్లకోసం వెతుక్కుంటూ

పోయారు. తిరిగి వచ్చి చూస్తే సామాన్ల మూట మాయం!

'అయినా ఏమీ పరవాలేదు. ముందుకే పోదాం' అని పోయారు, కానీ ఎంత దూరం నడిచినా అడవి అంతమే కాలేదు. ఎక్కడో దారి తప్పినట్లున్నారు. చూడగా అదంతా ఏదో కొత్త ప్రదేశం! తమకు ఏమాత్రం పరిచయం లేని ప్రాంతం!

అప్పటికే సాయంత్రం అయ్యింది. ఇంకొంచెం సేపట్లో చీకటి పడేటట్లున్నది. నలుగురూ ఓ చెట్టుపైకెక్కారు. అదే చెట్టు మీద ఓ తేనెపట్టు ఉండింది. శత్రువులు వచ్చారని తేనెటీగలన్నీ ఒక్కసారిగా వాళ్లమీద దాడి చేసాయి. వాటి బారినుండి తప్పించుకుందామని అందరూ పరుగెత్తి దగ్గర్లో ఉన్న ఓ కుంటలోకి దూకారు.

చూడగా అది ఓ ఊబి! బురదలో కూరుకుపోయిన నలుగురూ రాత్రంతా తన్నుకులాడి, అతి కష్టం మీద బయట పడ్డారు.

"ఇంటికెళ్ళిపోదాం రా!" అన్నాడొకడు.

"ఇంత కష్టపడింది ఎందుకు, బంగారం దొరికించుకోనిదే ఇంటికి పోరాదు!" అన్నారు మిగిలిన ముగ్గురూ.

నలుగురూ ముందుకే సాగారు. ఆరోజు మధ్యాహ్నానికి అడవి మధ్యలో ఉన్న ఓ మర్రి చెట్టు దగ్గరికి చేరుకున్నారు. వీళ్ల కోసమే అన్నట్టు అక్కడ చక్కటి అరుగు, కూర్చునేందుకు నాలుగు మంచి బండలు పరిచి ఉన్నాయి.

అలసిపోయిన నలుగురూ ఆ బండలమీద చేరగిల బడ్డారు. మరుక్షణం బండలు వేగంగా కదిలి, క్రింద నేలలోకి వెళ్ళిపోయాయి! కళ్ళు మూసి తెరిచేంతలో వీళ్ళు నలుగురూ ఓ పెద్ద భవనంలో ఉన్నారు!

అది ఒక బంగారు భవనం. అక్కడి వస్తువులన్నీ బంగారమే. వీళ్ళు నలుగురూ ఆత్రంగా తమకు నచ్చిన సామాన్లన్నీ సంచీల్లోకి వేసుకుంటూ పోయారు; ఎవరైనా కనబడతారేమోనని వెతుకుతూ. అక్కడ అసలు ఎవ్వరూ ఉన్నట్లు లేరు!

అంతలో బంగారు రంగులో మెరిసిపోతున్న ఆవు ఒకటి ప్రత్యక్షమైంది అక్కడ. వీళ్ళు

నలుగురూ దాని చుట్టూ చేరి, దాన్ని నిమిరారు. దాని కళ్ళు, పళ్ళు, తోక- మొత్తం అంతా బంగారమే! అంతలో అది తోక ఎత్తింది-

"బంగారు ఆవు పేడ వేస్తున్నదిరా, బంగారంలోంచి బంగారమే వస్తుంది, ఇంకేంటి' అని నలుగురూ దాని వెనక్కి చేరారు. అది బంగారు పేడ వేసిందనుకుంటున్నారు కదూ? కాదు- అది మామూలు పేడే వేసింది! వీళ్లందరి ముఖాలమీద చిందింది ఆ పేడ!

అందరూ కలిసి ముఖాలు కడుక్కునేందుకు వెళ్లారు. అది కూడా ఓ బంగారు కొలనులో ఉన్న బంగారు నీళ్ళతో! అక్కడే ఉన్న బంగారు బిందెలో ఆ నీళ్ళు నింపుకున్నాడు రంగయ్య. వెంటనే అతని కాళ్ళు అక్కడి నేలకు అతుక్కుపోయాయి! ఎంత ప్రయత్నించినా అతను శిలమాదిరి ఐపోయాడు తప్ప, ఇక కదలలేకపోయాడు! మిగిలినవాళ్ళు ఆ బిందెను వాడినుండి ఊడబెరికాకగానీ రంగయ్యకు మామూలు రూపం రాలేదు.

దాంతో నలుగురికీ చాలా భయం వేసింది.

అంతలోనే వాళ్లకు వినబడింది: "ఇక్కడినుండి వెళ్ళాలంటే మీరు అందరూ మోకాళ్ళమీద నిలబడి, ఏడ్చుకుంటూ ఏదైనా పాట పాడాలి. మాకు ఆ పాట నచ్చితే మిమ్మల్ని ఇక్కడినుండి తీసుకెళ్లటం కోసం మెరిసే తెల్లతామరలు, నల్లకలువలు పంపిస్తాం" అని.

నలుగురూ ఆ గొంతు చెప్పినట్లే మోకాళ్ళమీద నిలబడి, ఏడ్చుకుంటూ పాడారు-

*"మెరుపులు పూవుల దండగా*

*మబ్బులు మెత్తని దిండుగా*

*గగనము వెచ్చని శయ్యగా*

*హాయిగా ఉందుమె, తారకా?*

*కన్నుల క్రమ్మిన మబ్బులు తొలగెను*

*మనసుల నిండిన మోహము వదిలెను*

*తెల్ల తామరల తేరుపై, నల్లతామరల-నంచున నిడుకొని*

*రావే రంగుల తారకా! మమ్ముల కొనిపోవే రంగుల తారకా!*" అని.

మరుక్షణం అక్కడ రెండు తెల్లతామరలు, నల్లకలువలు ప్రత్యక్షం అయ్యాయి. "మీ దురాశ వదలకపోతే మరిన్ని కష్టాలు తప్పవు, జాగ్రత్త. ఇప్పుడిక తెల్లతామరలమీదికెక్కి నిలబడండి" అని వినిపించింది. అప్పటికే బాగా భయపడిపోయిన నలుగురూ చెంపలు వేసుకొని తెల్లతామరలు ఎక్కి నిలబడ్డారు. కన్నుమూసి తెరిచేలోగా వాళ్ళు వాళ్ల ఊరి అంచున ఉన్నారు! అంతవరకూ వాళ్లు పోయాయనుకున్న సామాన్లన్నీ వాళ్లతోటే ఉన్నాయి!

సంచులు మోసుకుంటూ వస్తున్న నలుగురినీ చూసి, అవ్వ ముసిముసి నవ్వులు నవ్వింది.

*"ఉడతా ఉడతా బడి కొస్తావా,*
*నా సంక నున్న సంచి కాస్త మోస్తావా?*
*చంటి నీ వెంట వస్తూ ఉంటినే,*
*కాని సంచి మోయలేక చస్త ఉంటినే*
*ఏమి దాస్తివే బంగారు ఇంత నీ సంచిలో*
*ఇంత బరువదేల నీ పెయ్యి నొయ్యదానే?"*

అని పాడింది గట్టిగా.

ఆ గొంతు విని, "ఈ ముసలిదానికి వయసు వచ్చింది కానీ చూపు చావలేదు- అయినా ఇంకోళ్లను అనేదేముంది, మాకు బాగా బుద్ధి వచ్చింది" అనుకుంటూ నలుగురూ ఎవరి ఇంటికి వాళ్ళు పోయారు.



**అయస్కాంత తత్వం!**

నవ్వు!

సైన్సు అయ్యవారు : పిల్లలూ! ప్రభుత్వం వారు ఇచ్చిన ఐరన్ మాత్రలు అందరూ వేసుకున్నారా?

సునీత : నేను వేసుకోలేదు సార్!

సైన్సు అయ్యవారు: ఎందుకు తల్లీ?!

సునీత : అయస్కాంతానికి అతుక్కుపోతే కష్టం సార్!

*-రిజ్వానా, ఆరవ తరగతి, ZPHS, సికెపల్లి.*

**మబ్బులు!**

టీచర్: కారు మబ్బులు అంటే ఏంటో చెప్పు చింటూ!

చింటు: కారు ఆకారంలో ఉండే మబ్బులు టీచర్!

*ఏడవ తరగతి పిల్లలు, మోడల్ స్కూల్, సికెపల్లి.*




# బావిలో దయ్యాలు

*రచన: లక్ష్మీ సుమిత్ర, ఏడవతరగతి, రిషీవ్యాలీ స్కూల్*

ఈ మధ్య ఒక రోజు ఎప్పుడో పేపర్‌లో ఒక వార్త చదివాను: భవానీపురం అనే ఊళ్లో ఒక పెద్ద బావి ఉందట. దాని నిండా కావలసినన్ని నీళ్లు ఉన్నాయట. అయినా ఆ ఊరి ప్రజలు వేరే బావి తవ్వించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నారట.

ఎందుకు? ఆ బావిలో దయ్యాలు, భూతాలు ఉన్నాయని! ఊళ్ళోవాళ్ళెవరూ ఆ బావిలో నీళ్ళు త్రాగరు; చీకటి పడుతున్నదంటే అటువైపుకు పోరు. పౌర్ణమినాడు, అమావాస్యనాడు గుంపులు గుంపులుగా వెళ్ళి ఆ బావికి పసుపు కుంకుమలతో పూజలు చేస్తారు!

ఆ వార్త చదివాక నాకు ఒక వైపున నవ్వొచ్చింది; కానీ మరొక వైపున బాధ కూడా వేసింది. మన దేశంలో ఎంత మంది ఇట్లా మూఢ నమ్మకాలకు బందీలో?!

అయినా నేను ఆ వార్తను పెద్దగా

పట్టించుకోలేదు. అయితే ఆరోజున బడిలో జరిగిన ఒక సంఘటన నాకు 'ఏదైనా చేయాల్సిందే' అనిపించేట్లు చేసింది.



ఆరో తరగతి చదివే దివ్య ఆరోజున అకస్మాత్తుగా నేలమీద పడిపోయి, ఒళ్ళు బిగబట్టి, కళ్ళు తేలవేసింది. మేమందరం ఆ పాప చుట్టూ మూగితే, మా సైన్సు సార్ వచ్చి "అందరూ దూరంగా పోండి, ఆ పాపకు గాలి ఆడాలి!" అని అరిచారు.

కొద్ది సేపటికి ఆ పాప కళ్ళు తెరిచి, మా అందరినీ చూసి సిగ్గుపడింది. మా టీచర్లు ఆ పాపకు ఇంకొకరిని తోడుగా ఇచ్చి, ఇంటికి పంపారు- "విశ్రాంతి తీసుకో పాపా" అని చెప్పి.

ఆ తర్వాత సైన్సు సార్ చెప్పారు- "ఆ పాపకు ఏమీ కాలేదు- భయపడకండి. సరిగ్గా అన్నం తినక, ఎక్కువ పని చేసి, అమితంగా కంగారు పడి, నిద్రకూడా తక్కువై పోతే మన శరీరం బలహీనపడుతుంది; ఒక్కోసారి ఇట్లా అవుతుంది. మళ్ళీ మళ్ళీ ఇట్లా అయితే మటుకు డాక్టరు దగ్గరికి వెళ్ళాలి. వాళ్ళు 'మూర్ఛ' కోసం మందులు ఇస్తారు. కొంతకాలం మందులు వాడితే ఇక అట్లా మూర్ఛలు రావు" అని.

సుధీర్ అడిగాడు- "సార్, అది దయ్యం పట్టటం కాదా?" అని.

"కానే కాదు. మన మెదడులో సహజంగా ఉండే ప్రవాహాలు కొన్ని గందరగోళ పడినప్పుడు అట్లా అవుతుంది. దానికి మందులున్నాయి" చెప్పారు సైన్సు సార్.

"అయితే సార్, మరి బావిలో దయ్యాలు ఎట్లా ఉంటాయి?" అడిగాను నేను.

అందరూ నవ్వారు. సైన్సు సార్ కూడా నవ్వారు. "దయ్యాలు ఎవ్వరికీ కనిపించవు కదా, మరి అవి బావిలో ఉన్నట్లు ఎలా

తెలుస్తుంది?" అన్నారు.

"కాదు సార్! మా ఊళ్ళో ఓ బావి ఉంది. అందులో నీళ్ళు ఎర్రగా ఉంటాయి. 'ఆ బావిలో దయ్యాలుంటాయి!' అంటారు అందరూ" చెప్పాడు సుధీర్.

"అవును సార్! ఈ మధ్యే పేపర్లో చదివాను. భవానీపురంలో అట్లానే అట" అన్నాను నేను.

"మా ఊరు భవానీపురమే" అన్నాడు సుధీర్.

అందరం ఆశ్చర్యంతో "వా...వ్" అన్నాం.



"నీళ్ళు ఎర్రగా ఉంటాయా? నిజంగానే?! దానికి కారణాలు 'ఖచ్చితంగా ఇవి' అని చెప్పలేం సుధీర్, అయితే మీకు తెలుసా, ప్రకృతిలో రెండు వస్తువులు కలిసి పూర్తిగా వేరే రంగును సృష్టిస్తుంటాయి. సున్నం ఎట్లా ఉంటుంది? తెల్లగా. మరి పసుపు ఎట్లా ఉంటుంది? పసుప్పచ్చగా. ఈ రెండూ కలిపి చూడండి- ఏ రంగు వస్తుంది? ఎరుపు!! దానితోటే కదా, పెళ్లి వేడుకల్లో కాళ్ళకు పారాణి పెట్టేది! అట్లా, మరి మీ బావిలో సున్నం ఉందనుకో, మీరు అందులోకి పసుపు వేసి పూజ చేస్తారనుకో, వెంటనే నీళ్ళు ఎర్రబారతాయి. దానిదేమున్నది?" చెప్పారు సైన్సు సార్.

నేను, సుధీర్ ఒకరి ముఖాలు ఒకరం చూసుకున్నాం. "చేసి చూడచ్చా సార్?" అన్నాం ఒకేసారి.

"ఓఁ చక్కగా చేయచ్చు. మన ప్రయోగశాలలోనే చేసి చూద్దాం" అని, ఆ రోజు సాయంత్రం చేసి చూపించారు కూడాను! నిజంగానే పారాణి ఎర్రగా రక్తంలాగా ఉంది!

"మరి మీ ఊరి బావిలో దయ్యాల్ని నేను వదిలించనా?" అడిగాను సుధీర్ని. "ఈ శని

ఆది వారాల్లో మా ఊరికి వెళ్తాను- నువ్వూ రా, చూద్దాం" అన్నాడు వాడు.

***

శనివారం నాడు ఉదయాన్నే బయలుదేరి సుధీర్ వాళ్ళింటికి వెళ్ళాను. అప్పటికే మా తరగతి పిల్లలు మరో ఐదుగురు నిలబడి ఉన్నారక్కడ. "మీరే వెళ్దామనుకున్నారా, మమ్మల్ని తీసుకెళ్ళకుండానే?!" అని నవ్వారు. అందరం కలిసి బయలుదేరాం.



సాయంత్రం అవుతుండగా భవానీపురం చేరుకున్నాం. ఊరి మొదట్లోనే ఒక తాత కనిపించాడు. "తాతా ఈ ఊళ్లో దయ్యాల బావి ఉందంటగా!" అది ఎక్కడ ఉందో తెలుసా?" అని అడిగాం.

"ఆఁ.. అది తెలీకేం?!" అన్నాడు తాత.

"మరి అదెక్కడో చూపిస్తావా, మాకు?" అడిగాడు శ్రవణ్.

"దయ్యాల బావికా? ఈ వేళప్పుడా?!" అడిగాడు తాత ఆశ్చర్యంగా. వీళ్ళింకా జవాబివ్వకనే "తిక్క పట్టిందా, మీకు? మీకు బుద్ధి లేదు; మీ పెద్దోళ్లకు బుద్ధి లేదు. ఈ వేళప్పుడు ఆ దరిద్రం బావి కాడికి వెళ్తారా ఎవ్వరైనా?" అరిచాడు కోపంగా.

సుధీర్ ఆ తాతకు కనబడకుండా మా వెనకనే నక్కాడు- "నేను చెప్పలేదా, ఎవ్వరినీ అడగకండి- ప్రయోజనం ఉండదు. నేను తీసుకెళ్తాను మిమ్మల్ని, రేప్పొద్దున. మా ఇంట్లో వాళ్లకి కూడా ఎవ్వరికీ చెప్పకండి" అంటూ.

అందరం వాడిని ఒప్పించి బావి దగ్గరికి నడిచాము. ఆ బావి ఊరికి చివర ఉంది. అక్కడికి చేరుకునే సరికి అందరికీ చాలా దాహం వేస్తున్నది. బావిలో పై అంచు దాకా ఉన్నాయి నీళ్లు. చేతులకు అందేంత నిండుగా... గబాల్న నా దోసిలితో నీళ్లు

తీసుకొని తాగబోయాను.

'అయ్యో ఆ నీళ్ళు తాగకు- అది దయ్యాల రక్తం!' అన్నాడు సుధీర్. 'రక్తమా?!' అన్నాను నేను. "అవును- కావాలంటే చూడు" అంటూ తన జేబులోంచి అగ్గిపెట్టె తీసి వెలిగించాడు. నీళ్ళు మామూలుగానే ఉన్నాయి.



"కానీ.. మరి నేను చూసినప్పుడు.." గొణిగాడు వాడు.

మేం అందరం నవ్వాం. "నువ్వు చూసినప్పుడు నీళ్లు ఎర్రగానే ఉండి ఉంటాయిలే. దానికి ఏదో ఒక కారణం ఉండి ఉంటుంది! అంతేతప్ప ఇక్కడ ఏ దయ్యాలూ లేవు!" అన్నాను నేను.

తర్వాత అందరం సుధీర్ వాళ్ళింటికి వెళ్ళాం. వాళ్ల అమ్మా వాళ్ళు మంచివాళ్ళు. మా అందరికీ భోజనం పెట్టారు. పడుకునేందుకు చోటు చూపించారు.

తెల్లవారాక నన్ను నేను పరిచయం చేసుకున్నాను- "మా నాన్నకు దైవశక్తి ఉందండి. భూతాలను తరిమేస్తాడు. నాకూ కొంచెం కొంచెం విద్యలు వచ్చు" అని.

"అవునా?" ఆశ్చర్యపోయారు వాళ్ళు.

"ఓ గ్లాసెడు పాలు ఇస్తారా?" అడిగాను, సుధీర్‌కి సైగ చేస్తూ.

"నేను తెచ్చిస్తాను" అని సుధీర్ లోపలికి వెళ్ళి, గ్లాసులో పాల బదులుగా మేం తీసుకొచ్చిన సున్నంపొడినే చిక్కగా కలిపిన నీళ్ళు పట్టుకొచ్చాడు.

"కొంచెం దేవుడి దగ్గరున్న పసుపు కావాలండి, ఒక చెంచాడు" అన్నాను నేను.

ఈసారి సుధీర్ వాళ్ళ అమ్మ వెళ్ళి పసుపు తీసుకొచ్చింది. నేను పసుపును కళ్ళకద్దుకొని, దాన్ని సున్నపు నీటికి కలిపాను- చూస్తూండగానే అదంతా

ఎర్రబడింది!

అందరూ నిర్ఘాంతపోయారు.

"ఇదేనండి అమ్మవారి మహిమ. మీ ఊరి బావిలో ఈ పాలను కలిపి వద్దాం పదండి. అట్లా ఊరికీ మేలు జరుగుతుంది" అని లేచాను నేను.

అందరూ నా వెంట వచ్చారు. "ఈ బావిలో దయ్యాలుంటాయి. ఈ నీళ్ళకు పసుపు తగిలిందంటే చాలు ఎర్రబడతాయి" చెప్పింది సుధీర్ వాళ్ల అమ్మ.

"నేను అన్నీ తెలిసినదానిలాగా నవ్వాను. అమ్మవారి పాలు కలిస్తే దయ్యాలు తక్షణం చచ్చిపోతాయి; మెల్లగా అన్నీ సర్దుకుంటాయి" అని చెప్పి గ్లాసులోని ఎర్ర నీళ్ళను బావిలోకి వంచాను.

"అయినా ఈ బావిలో దయ్యాలున్నాయని ఎవరు చెప్పారు? ఇవి పాల లాంటివి! అమ్మవారికి ఇవంటే ఇష్టం! అందుకనే పసుపు కలపగానే అమ్మవారు దాన్ని ఎర్రబరుస్తున్నారు" అని జోడించాను.

ఆరోజున ఆ బావిలోని నీళ్ళను రెండు బాటిళ్ళలో నింపుకొని పట్టణానికి తీసుకెళ్ళాం. సైన్సు సార్ సహాయంతో వాటిని ప్రభుత్వం వారి "త్రాగునీటి పరీక్షా కేంద్రం"కి తీసుకెళ్ళి, "పోటబులిటీ పరీక్ష" చేయించాం. ఆ నీళ్ళలో సున్నం ఎక్కువ ఉన్నదని తేల్చారు వాళ్ళు!

మన భూమి పొరల్లో ఉండే రకరకాల లవణాల్లో కొన్ని నీళ్లలో కరిగేవి ఉంటాయి. వాటి మీదుగా నీళ్ళు ప్రవహించినప్పుడు అవి నీళ్లకు వాటి లక్షణాలను ఇస్తాయి.

లవణాలు అధికంగా ఉండే నీళ్లను ఫిల్టర్ చేసుకొని త్రాగితే చాలా వరకు సరిపోతుంది. అంతకుమించి ఊరికే భయపడవలసిన పని లేదు.

అయితే ప్రయోగశాల వారి రిపోర్టు కంటే 'అమ్మవారి పాలే' ఎక్కువ ప్రభావం చూపాయని చెప్పాడు సుధీర్.

అమ్మవారి మహిమను నమ్మే ఊళ్ళో వాళ్ళు ఇప్పుడు ఆ నీళ్లను త్రాగేందుకు కాకపోయినా, ఇతర అవసరాలకోసం మటుకు బాగానే వాడుకుంటున్నారట!





# సొంత పిల్లలు

*రచన: పేరు రాయలేదు, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి.*

లలిత, వనిత ఇద్దరూ అక్కచెల్లెళ్లు. వాళ్ళది పేద కుటుంబం. తల్లిదండ్రులు ఇద్దరూ కూలికి పోయేవాళ్ళు. అయితే అకస్మాత్తుగా ఒక రోజున ప్రమాదంలో వాళ్ల అమ్మా నాన్నలు చనిపోయారు! ఆ సమయానికి లలిత చాలా చిన్నది- ఆరేళ్ళు అంతే. వనితేమో కొంచెం పెద్దది; ఆ పాపకు పదేళ్లు.

వాళ్ళిద్దరినీ చూసుకునేందుకు బంధువులు ఎవ్వరూ లేరు కూడా. చుట్టు ప్రక్కల వారి సహకారంతో కొద్ది రోజులు నెట్టుకొచ్చాక, చివరికి వనిత రామారావు గారి ఇంట్లో పనికి కుదురుకున్నది.

రామారావుగారు మంచి మనిషి. 'చిన్నపిల్లల్ని పనిలో పెట్టుకోకూడదు' అని ముందు వనితని పనిలోకి రానివ్వలేదు ఆయన. అయితే అందరూ నచ్చచెప్పాక, 'ఆ పాప పనిచేస్తూ చదువుకోవాలి' అన్న షరతు మీద ఆయన ఒప్పుకున్నాడు.

అయితే వనితకు చదువు ఏమంత

అబ్బులేదు. ఆ పాప మనసంతా పనిమీద, చెల్లెమీదే ఉండేది. 'చెల్లెని సరిగ్గా చూసుకోవాలి' అనే ఉండేది ఎప్పుడూ.

అంత చిన్న వయస్సులోనే తనకొచ్చే కాస్త నెలజీతాన్నీ రెండు భాగాలు చేసేది వనిత. ఒక భాగాన్ని ఇంటి ఖర్చులకు వాడేది; ఇంకొక సగాన్ని ఒక కుండలో దాచి పెట్టేది.

ఒక రోజున ఆ కుండలో ఇక డబ్బు పట్టలేదు- చూస్తే కుండ నిండిపోయి ఉన్నది! లలితకి, వనితకి ఆ డబ్బుతో ఏం చేయాలో తెలియలేదు. అంత డబ్బును ఇంట్లో ఉంచుకోవటం ఏమంత మంచిది కాదు!

కొంచెం సేపు ఆలోచించాక, దాన్ని తీసుకొని రామారావుగారి దగ్గరికి వెళ్ళారిద్దరూ- "ఈ డబ్బులు మీ దగ్గర పెట్టుకోండి; ఏమైనా అవసరం పడితే మళ్ళీ తీసుకుంటాం" అని.

ఆయన కాసేపు ఆలోచించి, "చూడమ్మా! లలితది ఇప్పుడు బడికెళ్ళే వయస్సు. నిజానికి నువ్వూ బడికి వెళ్ళాలి- కానీ వెళ్ళట్లేదు. ఒక పని చేద్దాం. ఈ డబ్బులు నా దగ్గర ఉంచుతాను. వీటితోటే లలితను చదివిద్దాం, మా పాప రేఖతో పాటు. ప్రభుత్వ బడిలో చేరితే ఖర్చులు కూడా ఏమంత ఉండవు- మధ్యాహ్నం భోజనం బడిలోనే పెడతారు; ఇక ప్రొద్దున-మాపున భోజనం మా యింట్లోనే చేయచ్చు- మెల్లగా వనిత కూడా కనీసం ఒకపూట బడికి పోవచ్చు" అన్నారు.



అట్లా లలిత బడికి వెళ్లటం మొదలెట్టింది.

రామారావుగారు ఆరోజునుంచి లలిత-వనితలకు చాలా సహాయం చేశారు. తన సొంత కూతురు రేఖతో పాటు వాళ్లనీ ఒకేలా చూసుకున్నారు.

అయితే ఒక రోజున రామారావు గారి చేతి గడియారం మాయం అయ్యింది. ఆయన స్నానం చేసేముందు దాన్ని, తన కళ్లజోడును

ముందుగదిలో టేబుల్ మీద పెట్టి వెళ్ళారు. వచ్చి చూసేసరికి అది లేదు! తన గడియారాన్ని ఎవరో తీసారని ఆయనకు అర్థం అయ్యింది. కానీ ఎవరు?



ఆ సమయానికి రేఖ బడికి వెళ్ళి ఉన్నది. వనిత ఇల్లు తుడుస్తూ ఉండింది. రామారావుగారికి వనిత మీద కొద్దిగా అనుమానం వచ్చింది. "బయటివాళ్లను ఇంట్లో పెట్టుకోవద్దంటే విన్నారా? చూడండి, ఇట్లానే అవుతుంది. ఈ రోజున గడియారం, రేపు మరొకటి!" అని రామారావుగారి భార్య గట్టిగా అనటం మొదలు పెట్టింది. అది విని వనిత చాలా నొచ్చుకున్నది.

ఆ పాప చిట్టి హృదయం చిన్నబోయింది. ఇల్లు తుడిచేటప్పుడు తను కూడా చూసింది- నిజంగానే ఆ గడియారం టేబుల్ మీద ఉండింది. మరి ఇప్పుడు అది ఎటు పోయింది?

ఆ రోజంతా వనిత మనసు మనసులో లేదు. ఒక వైపున పని చేస్తూనే మరో వైపున ఇల్లంతా వెతుకుతూ ఉండింది. గడియారం జాడలేదు.

ఆరోజు సాయంత్రం ఇంటికి వెళ్ళాక, మాయమైన గడియారం గురించి చెల్లెలికి చెప్పింది వనిత. "ఇవాళ్ళ బడిలో రేఖ తన స్నేహితురాళ్లకు ఒక గడియారం చూపిస్తూ ఉండింది. అదే అయి ఉంటుంది బహుశ:. నువ్వేం కంగారు పడకు- రేపు నువ్వు వెళ్ళేసరికి గడియారం ఇంట్లోనే ఉంటుంది చూడు" అని అక్కను ఊరడించింది.

మరునాడు వనిత పనికి వెళ్ళేసరికి, నిజంగానే గడియారం యథాప్రకారం టేబుల్ మీద ఉండింది. రేఖ దాన్ని తిరిగి తీసుకొచ్చేసిందనమాట!

అయితే గడియారం గురించి, రేఖ దాన్ని బడికి తీసుకెళ్లటం గురించి తనతో ఏమైనా

చెబుతారేమోనని ఆ రోజంతా చాలా ఎదురుచూసింది వనిత. కానీ రామారావుగారు ఆఫీసుకు వెళ్ళిపోయారు; ఆయన భార్యేమో తనకుగా ఏమీ అనలేదు!

మరునాటికి వనితకు జ్వరం వచ్చేసింది. ఆ పాపకు ఇక పనికి వెళ్లాలనిపించలేదు. లలిత బడికి వెళ్ళింది; వనిత మూలుగుతూ ఇంట్లోనే పడుకున్నది.

ఆరోజు సాయంత్రం అవుతుండగా వచ్చారు రామారావుగారు. వనితను, లలితను తమ ఇంటికే తీసుకెళ్ళారు. డాక్టరును పిలిపించి మందులు ఇప్పించారు. నిద్రలో అంతా వనిత కలవరిస్తూనే ఉండింది- 'నేను గడియారం తీయలేదు' అని.

మరునాడు జ్వరం కొద్దిగా తగ్గాక, వనిత వెళ్ళి రామారావుగారికి చెప్పింది- "ఇంక నేను పని మానేస్తాను" అని.

రామారావుగారు నవ్వారు. "అర్థమైందా?" అన్నట్లు భార్యవైపు చూశారు. రామారావుగారి భార్య కళ్ళనీళ్ళు పెట్టుకొని వనిత చేతులు పట్టుకొన్నది. రామారావుగారు వనితతో అన్నారు "మేమిద్దరం నిన్న దీని గురించి బాగా ఆలోచించాం- నిజంగానే, నిన్ను ఇక పనిలోంచి తీసేస్తున్నాం!" అని. వనిత నిర్ఘాంతపోయింది.

రామారావుగారు కొనసాగించారు చిరునవ్వుతో- "అయితే విను- ఇకనుండి మీ అక్కచెల్లెళ్ళిద్దరూ వేరుగా ఉండటానికి వీలులేదు- మాతోబాటు మా ఇంట్లోనే ఉండాలి. మేం ఇద్దరం మిమ్మల్ని పెంచుకోవాలని నిర్ణయించుకున్నాం. ఇకపైన మాకు ముగ్గురు ఆడపిల్లలు. నువ్వు, లలిత, రేఖ. ముగ్గురూ బడికి వెళ్ళాలి; ఆరోగ్యంగా, బలంగా, ఎదగాలి. గొప్పవాళ్ళవ్వాలి!"

"అవునే, మా మాట కాదనకు!" అన్నది రామారావుగారి భార్య. వనిత మళ్ళీ నిర్ఘాంతపోయింది- అయితే ఈసారి సంతోషంగా!

అటు తర్వాత వనిత కూడా బడికి వెళ్లటం మొదలు పెట్టింది.

రామారావుగారికి ఇప్పుడు ముగ్గురు పిల్లలు! ముగ్గురూ చక్కగా చదువుకుంటున్నారు. ముగ్గురూ తప్పకుండా గొప్పవాళ్లవుతారు!





# అక్కా-చెల్లెళ్లు

తెలుగు జానపద కథ

*ఈమధ్య కాలంలో మాకు ఎదురైన అతి చక్కని కథల్లో ఇది ఒకటి. 'రాజుగారు, ఆయన పిల్లలు ఇట్లా ఉంటారా-' అనకండి- జానపద కథల్లో ఎట్లా అయినా ఉండచ్చు!*

*సేకరణ: మనీష్, తొమ్మిదవ తరగతి,* ZPHS, *గుండువారి పల్లి, తలుపుల మండలం, అనంతపురం జిల్లా.*

అనగనగా ఒక రాజు ఉండేవాడు. అతనికి పెళ్లి అయింది; ఇద్దరు కూతుర్లు కూడా పుట్టారు; కానీ కొన్ని సంవత్సరాల తరువాత రాణీగారు చనిపోయారు. అప్పటినుండీ ఇద్దరు పిల్లల బాధ్యతా రాజుగారి మీదే పడింది.

పిల్లలిద్దరూ చాలా మంచివాళ్ళు. అయితే ఇప్పుడు వాళ్లకి అమ్మ లేదు కదా, అందుకని వాళ్ళకు పనుల్లో సాయం చేయటం కోసం మంగళ అనే ఆమెను తెచ్చి పెట్టారు రాజుగారు. మంగళ కూడా వాళ్ళతోబాటే ఉండేది, వాళ్ల ఇంట్లోనే. అయితే కొన్ని రోజులు అయ్యాక ఆమె కాస్తా రాజుగారి మీద మనసు పడ్డది. ఎలాగైనా రాజుగారిని పెళ్లి చేసుకొని, ఈ ఇద్దరు పిల్లల్ని ఇంటి

నుండి వెళ్లగొట్టాలని కంకణం కట్టుకున్నది.

ఒకరోజున పిల్లలు ఇద్దరూ పొయ్యి మీద అన్నం పెట్టి, బయటకు వెళ్లి ఆడుకొంటున్నారు. మంగళ వచ్చి "నాకు బట్టలు తోమడానికి బొగ్గులు కావాలి- కొన్ని బొగ్గులు తెచ్చిపెట్టండి" అని అడిగింది.



"సరేలే ఎందుకో అడుగుతోంది" అని పిల్లలు బొగ్గులు ఏరుకొచ్చి ఇచ్చారు. మంగళ ఆ బొగ్గుల్ని చాటలో ఎత్తుకెళ్ళి నేరుగా అన్నంలో వేసేసి, ఏమీ తెలియని నంగనాచిలా వెళ్లిపోయింది. ఆరోజున రాజు వచ్చి భోజనానికి కూర్చుంటే, పిల్లలు బొగ్గులు వేసిన అన్నం వడ్డించారు. "ఏమిటమ్మా ఇవి?" అడిగాడు రాజుగారు.

"ఏమో నాన్నా! మాకు తెలీదు" అన్నారు పిల్లలు.

రాజుగారికి చాలా కోపం వచ్చింది. "మంగళను పిలవండి" అని అరిచాడు.

మంగళ వచ్చింది. ఇదేంటి, అన్నంలోకి బొగ్గులు వేస్తారా, ఎవరైనా?" అరిచాడు రాజుగారు.

"నాకేం తెలుసు? మీ పిల్లల్నే అడగండి. నేను ఒద్దంటున్నా వాళ్ళే, బొగ్గులు ఎత్తెత్తి వేశారు అన్నంలో. కావాలంటే వాళ్ళ చేతులు, గోళ్ళు చూడండి. నల్లగా ఉండకపోతే అప్పుడు అడగండి నన్ను" అన్నది మంగళ గట్టిగా.

రాజుగారు చూస్తే పిల్లలిద్దరి గోళ్ళూ నల్లగా ఉన్నాయి.

"మాకేం తెలీదు- మంగళ బొగ్గులు తెమ్మంటే తెచ్చాం, అంతే" అన్నారు పిల్లలు. కానీ రాజుగారు నమ్మలేదు.

"పనిచేసి ఆకలితో ఇంటికొస్తే ఇట్లా చేస్తారా? ముందసలు మీరు ఎక్కడికైనా వెళ్ళిపోండి. మీ ముఖం నాకు చూపించకండి" అని పిల్లలిద్దర్నీ గట్టిగా తిట్టారు. అన్నం కంచం

ముందునుండి గబగబా లేచి వెళ్ళిపోయారు.

పిల్లలిద్దరూ ఏడుస్తూ గదిలో కూర్చుంటే మంగళ వచ్చి- "విన్నారుగా, మీ నాన్న చెప్పినా మీకు సిగ్గులేదా? పోండి. మీ ముఖం అసలు మాకు చూపించనే చూపించవద్దండి" అని ఇంట్లోంచి గెంటేసింది.



పిల్లలు ఏడ్చుకుంటూ అడవిలో పడి పోతూ ఉంటే తోక రాక్షసుడు ఒకడు ఎదురయ్యాడు. "ఎందుకు, ఏడుస్తు-న్నారు?" అని అడిగి, సంగతంతా తెలుసుకున్నాడు.

అసలు సంగతేంటంటే వాడికి పిల్లలిద్దరినీ చూసేసరికి నోరు ఊరింది. "నా వెంట రండి. ఇక్కడ ఊరవతలే నాకో భవంతి కూడా ఉంది. అందులో సలిపిండి (చలిమిడి) చేసుకునే సామానూ చాలా ఉంది" అని వాడు వాళ్ళిద్దరినీ భవంతిలోకి తీసుకెళ్ళాడు.

అక్కడికి వెళ్ళాక, వాళ్ళిద్దరినీ లోపలే పెట్టేసి, బయటినుండి తాళాలు వేసుకొని వెళ్ళిపోయాడు! వాడి అసలు ఉద్దేశం పిల్లలకు తెలీదు కద- అందుకని కొంచెం సేపు అక్కడే ఆడుకుంటూ కూర్చున్నారు. తర్వాత వాళ్లకు ఆకలైంది. వెతికి చూస్తే భవంతిలో సలిపిండి చేసుకునే సామాను అసలు ఒక్కటీ లేదు. అన్నీ ఏవేవో ఎండబెట్టిన జంతువుల మాంసాలూ, సారాయిలూ ఉన్నాయి గదుల నిండా!

దాంతో పిల్లలిద్దరికీ అర్థం అయ్యింది- 'వీడు ఎవరో మంచివాడు కాదు' అని, వాడు వచ్చేసరికి జాగ్రత్తగా ఒక మూలన నక్కి కూర్చున్నారు.

ఆరోజు రాత్రి రాక్షసుడు వచ్చీ రాగానే

"ఎక్కడున్నారు పిల్లలు?!" అని చూసి, "నిద్రపోతున్నారులే" అని అన్నంతినేసి వెళ్ళి పడుకున్నాడు.

అప్పుడు అక్క-చెల్లి ఇద్దరూ మెల్లగా లేచి వెళ్ళి, ఆ రాక్షసుడి తోకకు పరుపులు, దుప్పట్లూ అన్నీ చుట్టి కట్టేసి, నూనె పోసి అగ్గి ముట్టించి, ఆ గదిలోంచి గబగబా బయటికి పరుగెత్తి గొళ్ళెం వేసేసారు.

రాక్షసుడు లేచి చూసుకునేసరికి వాడి పరుపు, తోక అన్నీ అంటుకొని ఉన్నాయి! దాంతో వాడు గట్టిగా అరుస్తూ పారిపోదామని చూశాడు. కానీ బయటినుండి గొళ్ళెం వేసి ఉంది కదా, ఏమీ చేయలేక చివరికి వాడు కాస్తా మాడి మసైపోయాడు.

తెల్లవారాక అక్క-చెల్లి ఇద్దరే ధైర్యంగా పోయి వాడిని లాక్కెళ్ళి భవంతిలోనే బూంచి పెట్టారు. ఇంక ఆ రోజునుండీ వాళ్ళిద్దరే ఆ భవంతిలో ఉంటూ, అక్కడి తోటలో కొంచెం కూరగాయలు, ఆకుకూరలు, రాగులు అన్నీ పండించుకొని తింటూ హాయిగా ఉన్నారు.

అక్కడ రాక్షసుడి దగ్గర, ముందుగానే చాలా ఆవులు గేదెలు ఉండినై; ఇప్పుడు అక్క-చెల్లెళ్లకు అవి బాగా దగ్గరైనాయి. చెల్లెలేమో రోజూ ఆవుల్ని గేదెల్ని మేపేందుకు వెళ్లేది. అక్క ఇంట్లో పని చూసుకునేది. అలా కొన్ని రోజులు గడిచాయి.

ఇంక అక్కడ, వాళ్ల రాజ్యంలో, రాజుగారు ప్రొద్దునే లేచి 'పిల్లోల్లు ఏరి?' అని చూస్తే ఎక్కడా లేనే లేరు!

"వీళ్ళెక్కడికి పోయారు?" అని మంగళనడిగితే "నాకేం తెలీదు" అన్నది. రాజుగారు పిల్లలిద్దరికోసం రాజ్యమంతా వెతికించాడు గానీ, ఎవ్వరికీ వీళ్ళున్న భవంతి కనబడనే లేదు.

దాంతో రాజుగారు చాలా బాధపడ్డాడు. "బాధపడకు, నీకేమీ పర్వాలేదు" అని చెప్పి, మంగళ మెల్లగా రాజును మంచి చేసుకున్నది. కొంతకాలానికి రాజుకు కూడా మంగళ మీద ప్రేమ కలిగింది. "ఈమె చాలా మంచిదిలాగున్నది. ఇంక ఈమెని పెళ్ళి చేసుకుంటాను" అనుకున్నాడు రాజుగారు.

పిల్లలిద్దరూ రోజూ హాయిగా పనులన్నీ చేసుకొని, బాగా వండుకొని తింటున్నారు

కదా, ఇద్దరూ బాగా పెద్దయినారు; యుక్తవయసు వచ్చింది. ఇద్దరూ దేముడికి రోజూ మొక్కుకుంటున్నారు.

అక్కడ రాజు మంగళను పెళ్ళి చేసుకోవాలని అనుకోగానే, ఇక్కడ దేముడు అతని కళ్ళు తెరిపించాలనుకున్నాడు.



సరిగ్గా ఆ సమయానికి ప్రక్క ఊరి రాజకుమారుడు అటుగా వెళుతున్నాడు. అతనికి ఈ భవనం కనిపించింది; బాగా దాహంకూడా వేసింది. "ఇక్కడ ఎవరో ఉంటారు. నాకు నీళ్ళు దొరుకుతాయి" అని అతను ఇంటి తలుపు తట్టాడు.

ఆ సమయానికి చెల్లె అక్కడ లేదు. అక్క ఒక్కతే ఉండింది. రాజకుమారుడు ఆమెని చూసి "మాది ప్రక్క ఊరే! దారిలో పోతాఉంటే దాహం అయ్యింది. నీళ్ళు ఇవ్వు" అని అడిగాడు.

అక్క నీళ్ళు తెచ్చి ఇచ్చింది. "నువ్వెవరు, ఇక్కడెందుకు ఉన్నావు ఒంటరిగా?" అని అడిగాడు రాజకుమారుడు.

ఆమెను చూడగానే రాజ కుమారుడికి ఆమెను పెళ్ళి చేసుకోవాలని అనిపించింది. "నేను ఒంటరిగా ఉండను. ఇక్కడ మా చెల్లి కూడా ఉంటుంది. మేం ఇద్దరమూ ఇట్లా ఫలానా రాజుగారి పిల్లలం.." అని వాళ్ల కథంతా చెప్పింది అక్క.

"సరే అయితే, మరి నన్ను పెళ్ళి చేసుకుంటావా, నాతో మా దేశానికి రావచ్చు?!" అన్నాడు రాజకుమారుడు.

"మా చెల్లెని కూడా తీసుకెళ్దాం" అన్నది అక్క. అయితే వాళ్ళు మూడు రోజులు ఎదురు చూసినా, చెల్లి మటుకు ఇంటికి రానే లేదు!

రాజకుమారుడేమో "మనం వెళ్దాం- మీ చెల్లె కోసం మళ్ళీ రావచ్చులే" అని బలవంత

పెడుతూనే ఉన్నాడు.

చివరికి అక్క "సరే" అని అతనితోబాటు బయలుదేరింది. అయితే తను బయలుదేరే రోజున చాలా పూలు కోసుకొచ్చి, తను వెళ్ళే దారిలో అంతా ఆ పూలరేకులు చల్లుకుంటూ పోయింది- 'చెల్లెలు వచ్చి చూసుకుంటుంది కదా' అని.

చెల్లెలు ఆవుల్ని, ఎనుగొడ్లను వెంటబెట్టుకొని మరుసటి రోజే ఇంటికి వచ్చింది. 'అక్క లేదే' అనుకున్నది. కొంచెం సేపు వెతికాక, పూల దారిని కనుక్కున్నది- ఆ దారివెంట నడవటం మొదలు పెట్టింది.



అయితే కొంత దూరం పోయాక, పూలబాట ఆగిపోయింది! పూల రెక్కలన్నీ గాలికి చెల్లా చెదరైపోయి ఉన్నాయి!

చెల్లెలు ఏదో ఒక దారిని పట్టుకొని పోయింది. పోగా పోగా చివరికి వాళ్ల నాన్న రాజ్యమే ఎదురైంది!

ఆ సరికే రాజుగారు మంగళను పెళ్ళి చేసుకోబోతున్నాడు. రాజ్యంలో ఎవ్వరికీ మంగళ అంటే ఇష్టం లేకుండింది. ఇప్పుడు చెల్లెల్ని చూడగానే ప్రజలంతా "ఈమే మా యువరాణి" అని ఆమెను ఊరేగింపుగా రాజుగారి దగ్గరికి తీసుకెళ్ళారు.

ఆమెను చూడగానే కళ్ల నీళ్ళు పెట్టుకున్నాడు రాజుగారు. "అక్కేది? మీరు నన్ను వదిలి ఎందుకు వెళ్ళారు అసలు?" అని అడిగాడు. వాళ్ల మాటల్లో మంగళ మోసం కాస్తా బయట పడ్డది. రాజుగారు మంగళను దేశంలోంచి బహిష్కరించారు-

"పద, పద అక్కను పిల్చుకొద్దాం" అంటుండగానే, అక్క- ఆమెను పెళ్ళి చేసుకున్న యువరాజు అక్కడికి వచ్చారు.

అప్పటి నుండి అందరూ కలిసి సంతోషంగా జీవించారు!





# చిలక బాల

*కథనం: అన్నమనేని నియతి శ్రీశేష, ఆరో తరగతి, రిషీ వ్యాలీ*



అనగనగా ఒక ఋషి, ఆయన భార్య అడవిలో సుఖంగా జీవిస్తూ ఉండేవాళ్ళు. ఋషి చూసేందుకు మామూలుగానే ఉండేవాడు, కానీ ఆయనకు చాలా మహిమలు వచ్చు.

వాళ్లకి పిల్లలు లేరు. అయితే ఒకరోజున ఋషి భార్య అంది- "పొయ్యిలోకి కొన్ని ఎండు పుల్లలు ఏరుకు రారాదూ, అడవిలోంచి?!" అని.

ఋషి పుల్లలు ఏరుకుంటుంటే, దగ్గర్లోనే దబ్బున శబ్దం అయ్యింది. చూస్తే అది ఒక చిట్టి రామచిలుక! చెట్టు మీది నుండి క్రింద పడింది; కదలలేకపోతున్నది.

ఋషి దానిని ఇంటికి తీసుకెళ్లాడు. రకరకాల మూలికలతో దానికి వైద్యం చేశాడు.



ఆయన భార్య దాన్ని చూసి జాలి పడ్డది. దాన్ని జాగ్రత్తగా చూసుకున్నది.

కొన్ని రోజుల తర్వాత చిలుక కాలు బాగా అయింది. ఇప్పుడు అది ఆడుతూ, పాడుతూ ఉంది. ఋషికి, ఋషి భార్యకు అది చాలా మాలిమి అయ్యింది. వాళ్ళు దాన్ని సొంత బిడ్డలాగా ప్రేమించసాగారు.



ఒకరోజున ఋషి భార్య అడిగింది, ఋషిని. "నీ మంత్ర శక్తితో దీన్ని ఒక పాపగా మార్చరాదూ?! మనం చక్కగా ఆ పాపను పెంచుకోవచ్చు!" అని.

ఆయన 'సరే' అని, ఓ మంత్రం చదివి నీళ్లు చల్లగానే చిలుక కాస్తా ఒక చిన్న పాప అయ్యింది. ఆ పాపకు వాళ్ళు చిలకబాల అని పేరు పెట్టుకున్నారు. చక్కగా ఆ పాపను పెంచుకోసాగారు.



ఒకరోజున చిలక బాల నీళ్ల కోసం నది దగ్గరికి వెళ్లింది. తను వెళ్లేటప్పుడు చూసిన ఋషి "పాప ఇప్పుడు పెద్దదయింది.. పెళ్లి వయసు వచ్చింది. ఎవరైనా మంచి వరుడిని చూసి పెళ్ళి చేయాలి" అనుకున్నాడు.



ఆ రాత్రి అన్నం తినేటప్పుడు "చిలక బాలా! ఇప్పుడు నీకింక పెళ్ళివయసు వచ్చిందమ్మా. ఏదైనా మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాం- సరేనా?" అన్నాడు ఋషి.

అది వినగానే చిలక బాల మొహం తెల్లగా అయింది. "ఏంటి? నేనంటే మీకు ఇష్టం లేదా? పెళ్లి చేసుకొని నేను అత్తగారింటికి వెళ్లిపోతే మీకు సంతోషమా?" అని చటుక్కున లేచి వెళ్ళిపోయింది.

"నాకు చాలా ఇష్టమైతే తప్ప, ఎవ్వరినీ పెళ్లి చేసుకొనేది లేదు" అనుకున్నది మనసులో.

అరగంట తరువాత ఋషి వచ్చి మంచం కింద నుంచి బైటికి లాగాడు తనని. "నిన్ను

వదలడం నాకు కూడా ఇష్టం లేదమ్మా! కానీ నువ్వు పెళ్లి చేసుకోవాల్సిందే. నీకు నచ్చేవాడిని వెతుకుతాగా?!" అన్నాడు.

చిలక బాల కళ్లు మూసుకొని "సరే" అన్నది.



తరువాతి రోజున తెల్లవారుతూనే సూర్యుడిని పిలిచాడు ఋషి. "సూర్యుడా! సూర్యుడా! ఇటు రా! నా కూతుర్ని పెళ్లి చేసుకోవటం నీకు ఇష్టమేనా?!" అని అడిగాడు.

"ఓ! మీ అమ్మాయంటే నాకు చాలా ఇష్టం. పెళ్ళికి ఎప్పుడంటే అప్పుడు సిద్ధం!" అన్నాడు సూర్యుడు.

అప్పుడు చిలకబాల- "వద్దు నాన్నా! సూర్యుడు చాలా వేడిగా ఉంటాడు. అంత వేడిని నేను భరించలేను. ఇంతకంటే మంచి సంబంధం చూడు నాన్నా!" అన్నది.

'సరే- సూర్యుడికంటే, వాడిని మూసేసే మేఘాలు గొప్పవి కదా!" అని ఋషి ఈసారి మేఘాలని పిలిచాడు.

"మేఘం! మేఘం! నువ్వు నా కూతురిని పెళ్లి చేసుకుంటావా?" అని అడిగాడు.

"ఓఁ! తను ఒప్పుకుంటే తప్పకుండా చేసుకుంటాను" అన్నది మేఘం.

చిలక బాల అన్నది- "నాన్నా! ఈ మేఘాలు ఎక్కువ కాలం బ్రతకవు- కొద్దిరోజులకే వర్షం అయిపోయి కురుస్తాయి. వీళ్ళకంటే మంచివాళ్లని ఇంకొకరిని చూడు!" అని.

ఈసారి ఋషి గాలిని పిలిచాడు. "మేఘాలకంటే గొప్పది గాలే! గాలి వీస్తే ఇక మేఘాలు

ఎక్కడికో కొట్టుకు పోతాయి!" అని.

చిలక బాల అందం చూసి 'పెళ్లి చేసుకుంటాను' అన్నది గాలి. కానీ చిలకబాల ఒప్పుకోలేదు. "గాలిలో అన్నీ కొట్టుకు పోతాయి. నేను కూడా ఏదో ఒక రోజు కొట్టుకుపోతాను. నాకొద్దు నాన్నా!" అన్నది.

ఈసారి ఋషి ఒక పర్వతాన్ని పిలిపించాడు. "నేను ఈయన్ని చేసుకోను నాన్నా! పెద్ద బండరాయి! అస్సలు కదలడు, మెదలడు!" అన్నది చిలకబాల.



అంతలో ఒక చిలక వచ్చి చెట్టు మీద కూర్చుంది.

దాన్ని చూడగానే చిలుకబాల సిగ్గులమొగ్గే అయ్యింది. "ఈయన నాకు నచ్చాడు నాన్నా! చూడు- ఎంత అందమైన రెక్కలు ఉన్నాయో! ఈయన ముక్కుకు ఉన్న రంగు ఇంకెవ్వరికీ లేదు, చూశావుగా?!" అంది గుసగుసగా.

ఋషి, ఋషి భార్య నవ్వారు. చిలుక బాలని కాస్తా మళ్ళీ చిలకగా చేసారు. చిలకరాజుకు, చిలక బాలకు ఇద్దరికీ పెళ్లి చేశారు!



**ఇడ్లీల లెక్క!**

నవ్వు!

టీచర్: మహేష్! నీ దగ్గర ఐదు ఇడ్లీలు ఉన్నాయనుకో, అవి మొత్తం నేను తీసుకుంటే ఇంక ఏం మిగులుతాయి?

స్టూడెంట్: ఏం మిగులుతాయి టీచర్, సాంబారు- చట్నీ మాత్రం మిగులుతాయి!

*సేకరణ: అళివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*



# అపనమ్మకపు టింకీ!

రచన: వరప్రసాద్, పదవ తరగతి. నాగసముద్రం



నాగసముద్రానికి తూర్పున ఉన్న అడవిలో పింకీ, టింకీ, చంకీ అని మూడు కుందేళ్లు ఉన్నాయి. అవి మూడూ మంచి స్నేహితులు. ఓసారి ఆ మూడూ రామయ్య అనే రైతు తోటలో క్యారట్లు తింటూ ఉన్నాయి.



సరిగ్గా ఆ సమయానికే రామయ్య, అతని చిన్ననాటి స్నేహితుడు సోమనాథ్ ఇద్దరూ మాట్లాడుకుంటూ అటుగా వచ్చారు. "ప్రక్క ఊరిలో జాతర జరుగుతుందట, వెళ్దాం సోమనాథ్" అంటున్నాడు రామయ్య. ఆ సంగతి విన్నది టింకీ.



వెంటనే పరిగెత్తుకొని వచ్చి పింకీకి, చంకీకి ఆ సంగతి చెప్పింది. "మనం కూడా వెళ్దామా?" అంది. 'సరే' అని ముగ్గురూ జాతరకు బయలుదేరారు. దారిలో ఈత కాయలు, నేరేడు పండ్లు కడుపునిండా తిన్నారు ముగ్గురూ. చివరకు జాతరకు చేరుకున్నారు. దేవుడిని దర్శించుకున్నారు. గుడి ప్రక్కనే ఐస్క్రీం బండి ఉంది. ముగ్గురికీ నోరు ఊరింది. వెంటనే అక్కడికి వెళ్లి తలా ఒక ఐస్క్రీం తీసుకున్నారు. అప్పుడు గుర్తొచ్చింది- వాళ్ల దగ్గర డబ్బు లేదు!



పింకీ, చంకీ ఐస్క్రీములు చేత బట్టుకొని అక్కడే నిలబడ్డాయి. "ఇంటికెళ్లి డబ్బులు తీసుకురా, టింకీ! గబుక్కున వచ్చేయి!" అని టింకీని ఇంటికి పంపించాయి. 'సరే' అని బయల్దేరింది టింకీ.

అయితే వెంటనే దానికో అనుమానం వచ్చింది- "నేను వచ్చే లోపల వాళ్లు నా ఐస్క్రీం కూడా తినేస్తే ఎలాగ?" అని. అందుకని అది ఇంటికి పోకుండా ప్రక్కనే ఉన్న ఓ చెట్టు చాటున దాక్కొని, పింకీ-చంకీల చేతుల కేసే చూడటం మొదలు పెట్టింది.



అరగంట దాటింది.. ఇంకా రాలేదు టింకీ. ఆలోగా ఐస్క్రీం మొత్తం కరిగిపోయి కారటం మొదలెట్టింది. "అయ్యో ఐస్క్రీం మొత్తం కారిపోతోందే" అని ఏడుపు మొహంతో దాన్ని నాకెయ్యబోయారు పింకీ-చంకీలు.



"ఏయ్! నాకు తెలుసు, మీరు మోసం చేసి, నా ఐస్క్రీం కూడా తినేస్తారని! అందుకనే, నేనసలు ఇంటికి వెళ్ళనే లేదు- ఇక్కడే, ఆ చెట్టు చాటున దాక్కొని చూస్తున్నాను!" అని ఇకిలించింది టింకీ, వాళ్ళ ముందుకు దూకి. మిత్రులిద్దరికీ పిచ్చి కోపం వచ్చింది.



"మమ్మల్ని క్షమించన్నా. ఇది ఇంత తెలివి తక్కువ దద్దమ్మ అనుకోలేదు- మేమిద్దరం వెంటనే ఇంటికెళ్ళి, పది నిముషాల్లో నీ డబ్బులు నీకు తెచ్చిస్తాం" అన్నాయవి ఐస్క్రీం బండి అతనితో.

బండి అతను నవ్వి "ఈ టింకీ ఒట్టి దద్దమ్మే కాదు. దీనికి నమ్మకం అంటే ఏంటో కూడా తెలీదు. ముందు దీనికి స్నేహంగా ఉండటం నేర్పండి. నాకేం డబ్బులు ఇవ్వక్కర్లేదులే" అని బండిని నెట్టుకుంటూ వెళ్ళిపోయాడు.



# కలిసి బ్రతుకుదాం!

ముచ్చట్లు

*బి. నివేదిత, తొమ్మిదవ తరగతి తెలుగు మీడియం, యస్.యన్.వి. స్కూల్, జహీరాబాదు, తెలంగాణ.*

ఒక చేతిలో కర్ర, మరో చేత సంచీ పట్టుకొని ఒక మనిషి అడవిలోకి ప్రవేశించాడు. అటూ యిటూ చూస్తూ, పాటలు పాడుకొంటూ పోతున్నాడు.

ముందుగా అతన్ని చూసిందొక కుందేలు. పరుగు పరుగున పోయి తన మిత్రులు జింకకు, నెమలికి ఆ సంగతి చెప్పింది. మూడూ పొదలమాటున దాగి చూసాయి- "వీడు ఇటు ఎందుకు వచ్చాడు?" అనుమానంగా అడిగింది నెమలి. "వేటకే అయి ఉంటుంది! ఇంకెందుకు వస్తాడు?" అన్నది జింక.

"ఎట్లా కనుక్కోవటం?" అంది నెమలి.

"వాడి చూపులు చూస్తే తెలియట్లేదా?" అంది జింక.

"ఆ మనిషినే అడిగి చూస్తాను.. అపకారి అయితే సూటిగా నేనే ఎదుర్కొంటాను- మీరు పొదలమాటున దాగి ఉండండి-

బయటికి రాకండి!" అని ఓ ఎత్తయిన చెట్టు పైకెగిరి కూర్చుంది నెమలి- "ఎవరయ్యా, నువ్వు?! ఈ అడవిలోకి వచ్చింది వేటకోసమేనా? ఆ సంచిలో ఏమున్నాయి? వేటకత్తి, వల తెచ్చావా?! మర్యాదగా అందులో ఏమున్నాయో చూపించు తక్షణం!" గద్దిస్తూ ప్రశ్నించింది నెమలి.

ఆ మనిషి ఆగి "మిత్రమా! నేను వేటగాడిని కాదు- వేటాడేందుకు రాలేదు. నేనొక పర్యావరణ ప్రేమిని. సహజ వాతావరణమన్నా, పరిసరాలన్నా నాకు ఇష్టం. అడవి అందాలను ఆస్వాదిద్దామని, మిమ్మల్ని చూద్దామని వచ్చాను. మీరు నన్ను అనుమానించవలసిన పనిలేదు. నేను మేలు చేసేవాడినే కాని కీడు చేసేవాడిని కాను. పక్షులకు ఆహారంగా వేద్దామని ధాన్యాలు తెచ్చాను- చూడండి" అన్నాడు నెమలికి సంచీని చూపిస్తూ.

"మీ మనుషుల్ని మేం నమ్మం. మీరు నమ్మించి మోసం చేస్తారు. మా పరిసరాలన్నిటినీ నాశనం చేస్తున్నది మీరే" అన్నది నెమలి.

"అవును. నిజంగా అవును" అరిచాయి కుందేలు, జింక బయటికి వచ్చి నిలబడి.

"మీ తెలివి తక్కువతనం, స్వార్థం వల్ల ఎన్ని జీవజాతులు అంతరించిపోతున్నాయో తెలుసా, అసలు మీకు?!" కుందేలు అన్నది ఆవేశంగా.



"రాయీ-రప్పా, చెట్టూ-చేమా, పక్షులు-జంతువులు అన్నీ నాశనమే. సమతుల్యంగా వుంటేనే కదా, అన్ని జీవులకూ మనుగడ? ఈ సంగతి ఎప్పటికి తెలుస్తుంది, మీ మనుషులకు?" కోపంగా అడిగింది జింక.

విచక్షణ లేకుండా ప్రవర్తించటం వల్ల ప్రకృతి దెబ్బతింటున్నదని గుర్తించే కదా, మా

ప్రభుత్వం కొన్ని అరణ్యాలని అభయారణ్యాలుగా ప్రకటించింది; అంతరించిపోతున్న జీవ జాతులకు రక్షణ, పోషణ కల్పిస్తున్నది; పర్యావరణాన్ని కాపాడాలి అని ప్రచారం చేస్తున్నది" అన్నాడు మనిషి.

"ప్రభుత్వాలు ప్రకటించినంత మాత్రాన మా కష్టాలు తీరినాయా? మీ మనుషులు దొంగచాటుగా ఎన్ని కృత్యాలు చేయడం లేదు?!" ఈసడిస్తూ అన్నది కుందేలు.

"నువ్వన్నది నిజమేనమ్మా. అక్షర సత్యం. వ్యక్తిగతంగా ప్రతి మనిషీ తనకు తానుగా బాధ్యతను గుర్తించి మసలుకోవాలి. జీవజాలం అంతా ఒకదానిమీద ఒకటి ఆధారపడి జీవనం సాగిస్తున్నాయి. పుష్పజాతులు పెరిగితే తేనెటీగలు వృద్ధి చెందుతాయి; మధురమైన తేనెను ఇస్తాయి. ఎలుకలను అదుపులో ఉంచి పాములు, గింజలు తయారు చేయటంలో చురుకుగా వ్యవహరించి కీటకాలు రైతులకు ఎంతో మేలు చేస్తున్నాయి కదా. అట్లా ఒక జీవం లేదంటే మరొకటి ఉండదు.

అందుకని అందరం కలిసి బ్రతకాలి. సహజీవనమే మార్గం; మరొకటి లేదు" అన్నాడు మనిషి.

"పరిసరాలను మీకు అనుగుణంగా మలుచుకుంటూ, మా ఉనికికి, భద్రతకు ముప్పు కలిగించడం సరైందేనా, చెప్పు అసలు?" ప్రశ్నించింది జింక.



"తప్పే తల్లీ. అందుకనే- దాన్ని గుర్తించి, అట్లాంటి అనర్థాలు జరగకూడదనే ఉద్దేశ్యంతోనే- అనేకమంది మనుషులు స్వచ్ఛంద సంస్థలద్వారా కృషి చేస్తున్నారు. మనుషులందరూ స్వార్థపరులు కారు తల్లీ. ముఖ్యంగా ఇప్పటి పిల్లలు చాలామంది

పర్యావరణాన్ని గౌరవిస్తారు; జీవరాసులన్నిటినీ అభిమానిస్తారు, ప్రేమిస్తారు" చెప్పాడు మనిషి.

"అవునవును. మమ్మల్ని కొట్టేయకూడదు. జంతువులతోటి ఎక్కడలేని విన్యాసాలూ చేయించకూడదు" అన్నది అప్పటివరకూ ఊరికే నిల్చున్న చెట్టు.

"అవునవును. అందుకని మీరంతా ఇంక వేటాడటం మానెయ్యాలి. అందరం సహజీవనం చేద్దాం. అందరం కలిసి భావి తరాలకు మంచి పరిసరాలను అందిద్దాం" అన్నది జింక.

"మనం అందరం ఒకరికొకరం శత్రువులం కాదు. నేస్తాలం!" అన్నాయి నెమలి, జింక, కుందేలు.

మనిషి వాటితో గొంతు కలిపాడు.



**ప్రశ్నలు-జవాబులు!**

నవ్వు!

1. తిక్క ప్రశ్న: పెన్సిల్ ఎక్కడికి పోయింది?

కొంటె జవాబు: పెన్సిల్వేనియా!

2. తిక్క ప్రశ్న: సునీత రోడ్డుమీద బ్రెడ్డు ముక్కలు ఎందుకు పడేసింది?

కొంటె జవాబు: ట్రాఫిక్ 'జాం' అయ్యిందని విన్నది!

3. తిక్క ప్రశ్న: లెక్కల పుస్తకం ఎప్పుడూ ఎందుకు ఏడుస్తుంది?

కొంటె జవాబు: దాన్నిండా ప్రాబ్లమ్స్ ఉంటాయని!

4. తిక్క ప్రశ్న : కంప్యూటరు డాక్టరు దగ్గరికి ఎందుకెళ్ళింది?

కొంటె జవాబు : దానికి వైరస్ అంటుకున్నదని!

**డబ్బుల గోల!**

ట్యాక్సీ డ్రయివర్ : బ్రేకులు ఫెయిలయ్యాయి! బండి ఆగడం లేదు! ఇప్పుడు ఏం చెయ్యాలి సార్?

పిసినారి నరసయ్య : ముందు మీటర్ ఆపు బాబూ, తర్వాతి సంగతి తర్వాత చూద్దాం!

*సేకరణ: అలివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*



# ఉపాయం

*రచన: యన్. సలోమి, ఏడవ తరగతి.ఎ, మహీంద్రా అకాడమి, జహీరాబాదు.*
*సౌజన్యం: మన లైబ్రరీ, జహీరాబాదు.*

ఒక ఊరిలో కుమార్ అనే పిల్లవాడు ఉండేవాడు. కుమార్ ఆరవ తరగతి చదువుతున్నాడు- అతను ఒక మోస్తరు విద్యార్థి. శ్రమ పడితే చదువు బానే వస్తుంది; కానీ అట్లా శ్రమపడటం అంటే అతనికి ఏమంత ఇష్టం ఉండేది కాదు.

"ప్రొద్దున్నే లేచి చదువుకోరా, చదువు బాగా వంటపడుతుంది' అని వాళ్ల నాన్న ఎంత చెప్పినా కుమార్ వినేవాడు కాదు. అసలు సంగతేంటంటే వాడికి నిద్రపోవటం చాలా ఇష్టం. రాత్రి త్వరగా పడుకునేవాడు; అయినా ఉదయం ఆలస్యంగానే నిద్ర లేచేవాడు. సమయం దగ్గర పడగానే గబగబా లేచి, త్వరత్వరగా తయారయ్యి, బడికి పరుగు తీసేవాడు.

అట్లా చాలా సార్లు జరిగాక, ఒక రోజున వాళ్ల

నాన్నగారు ఆలోచించారు- "వీడు ప్రొద్దున్నే త్వరగా లేవాలంటే ఏమి చేయాలి?" అని. ఆయనకో అద్భుతమైన ఉపాయం తట్టింది.

ఆయన వెంటనే పట్టణానికి వెళ్లి, ఒక కెమెరా కొనుక్కొచ్చారు. దాన్ని కుమార్‌కి ఇచ్చి "ఒరేయ్ కుమార్! చలికాలం వస్తున్నది కదా, మన ఊరి నుండి లెక్కలేనన్ని పక్షులు కొల్లేరుకు వలస వెళ్తున్నాయట. వాటిలో కొన్ని అరుదైన పక్షులు కూడా ఉంటాయి. అట్లాంటి అరుదైన పక్షుల ఫొటోలకోసం దినపత్రికల వాళ్ళు ఎంతగానో ఎదురు చూస్తున్నారని తెలిసింది.

మనం ఫొటో తీసిన పిట్ట రకాన్ని బట్టి వాళ్ళు వెయ్యి రూపాయల వరకూ ఇవ్వవచ్చు. అంతే కాక ప్రశంసా పత్రం, ఆ ఫొటోలు తీసిన వ్యక్తి గురించి దిన పత్రికలో ఓ చిన్న సమాచారం కూడా వేస్తారట.

అయితే పక్షులన్నీ కనబడేది తెల్లవారు జాముననే కదా, అందుకని మనం రేపు ఉదయాన్నే 5:30 కి లేచి మేడ మీద కూర్చొని ఆ పక్షుల ఫొటోలు తీద్దాం" అని చెప్పారు.

దినపత్రికలలో తన గురించి వేయటం, నగదు-ప్రశంసా పత్రం- ఇట్లాంటి మాటలు వినగానే కుమార్‌కు ఆశ పుట్టింది.

మరుసటి రోజునుండి ఉదయం 5:30 కల్లా నిద్రలేచి, మేడపైకి వెళ్ళి, పక్షుల కోసం ఎదురు చూడసాగాడు.



అక్కడ వాడికి రకరకాల పక్షులు కనిపించేవి. చిలకలు, పిచ్చుకలు, కొంగలు- ఒక్కోసారి ఏవో వింత పిట్టలు కూడాను. అయితే వాడు ఫొటో తీద్దామనుకునేసరికి అవి ఎగిరిపోయేవి.

అంతలోనే వాడికి సలీం అలీ రాసిన పక్షుల పుస్తకం ఒకటి బహుమతిగా ఇచ్చాడు వాళ్ల

నాన్న . "దీన్ని చూస్తే పక్షుల్ని గుర్తు పట్టటం సులభం" అని.

బయట పక్షుల్ని చూడటం, తర్వాత వాటి గురించి పుస్తకంలో చదవటం- అప్పుడప్పుడూ వాటిని ఫొటోలు తీయటం, తనూ సలీ అలీ అయిపోయినట్లు కలలు కనటం- ఇట్లా కొన్ని రోజులు గడిచాయి.



చూస్తూ చూస్తూండగానే చలికాలం వచ్చేసింది. ఇప్పుడింక పక్షులు ఏమన్ని కానరాలేదు. "ఇంక వలస పక్షుల కోసం చూడనక్కర్లేదు- సమయం వృథా" అనుకున్నాడు కుమార్. ఉదయాన్నే లేవకుండా మళ్లీ తనపాత పద్ధతిలోకి మారిపోవాలనుకున్నాడు.

కానీ ఎందుకనో, అది ఇక వీలు కాలేదు! ఉదయాన్నే లేవడం అలవాటు అయిపో-యినట్లుంది- ప్రతిరోజూ అయిదున్నరకు మెలకువ వచ్చేసేది!

మెల్లగా వాడు ప్రొద్దున్నే చదువుకోవటం మొదలెట్టాడు. విషయాలు కూడా వాడికిప్పుడు ఇంతకు ముందుకంటే బాగా అర్థమౌతున్నాయి!

తన పథకం ఫలించినందుకు కుమార్ వాళ్ల నాన్న ఎంతో సంతోషించాడు. 

**ఏం సాకులు?!**

మేనేజర్: ఏమయ్యా రోజూ ఆఫీసుకు ఆలస్యంగా వస్తున్నావు? ఈరోజు ఏకంగా గంట ఆలస్యమా?!

అబద్ధాల రాంబాబు : ఈ రోజు నేను డాబా మీద నుండి కింద పడిపోయాను సార్!

మేనేజర్: వాట్!? డాబా మీది నుండి క్రింద పడడానికి నీకు ఏకంగా గంట టైం పట్టిందా?!

*సేకరణ: అళివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*



# మోసం

*రచన: అఖిల్ కుమార్, ఇంటర్మీడియట్, భవానిపురం , విజయవాడ.*

బ్రిటిష్ వాళ్ళు మన దేశాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో బెజవాడ దగ్గర్లోనే ఒక పల్లెటూరు ఉండేది. ఆ పల్లె చాలా చిన్నది.

అక్కడ ప్రజలంతా చాలా అమాయకులో, అజ్ఞానులో- 'వాళ్లకి అసలు ఏమి తెలుసు, ఏమి తెలీదు' అనేదే మనకు తెలీదు.

వాళ్లెవ్వరికీ అసలు కరెంటు బల్బు అంటే తెలీదు. ఊరు మొత్తానికీ ఒకే ఒక్క టెలిఫోన్- పోస్టాఫీసులో ఉండేది. దాన్ని ఎలా వాడాలో తెలిసిన వాళ్ళు ఏ ఒక్కరో ఇద్దరో ఉండేవాళ్ళు.

అట్లాగే ఊరు మొత్తానికీ కలిపి ఒకే ఒక్క గడియారం ఉండేది. పంచాయితీ ఆఫీసుకు పైన ఉండేది, ఆ గడియారం.

ఊళ్ళో ఒక్క రేడియో కూడా ఉండేది కాదు; ఇక టెలివిజన్ సంగతే అడగకండి. సెల్‌ఫోనులు, కంప్యూటర్లు అప్పటికి ప్రపంచంలోనే ఇంకా ఎక్కడా లేవు, ఇంక ఆ

ఊళ్ళో ఎందుకుంటాయి?- అట్లాంటివేమీ లేవు.

ఒకనాడు ఉన్నట్టుండి ఏదో అయ్యింది- ఎవ్వరికీ తెలియదు, నిజంగా ఏమైందో- కానీ ఆనాటి నుండీ రోజులు తొందరగా గడిచిపోసాగాయి ఊళ్ళో. పొద్దు నిలవడం లేదు- మధ్యాహ్నం ఒంటిగంటకే సూర్యుడు అస్తమిస్తున్నాడు! ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా ఊళ్ళోవాళ్ళకి నిద్ర ఆగట్లేదు. అందరూ గందరగోళ పడసాగారు.

చూస్తూ చూస్తూండగానే పరిస్థితులు మరింత విషమించాయి. తెల్లవారుజామున ఐదు గంటలకే సూర్యుడు అస్తమించటం మొదలు పెట్టాడు! రాత్రిపూట ఎవ్వరికీ నిద్ర పట్టట్లేదు- ఉదయం ఎనిమిదికల్లా అందరికీ నిద్ర రావటం మొదలైంది!

జనాలంతా దిక్కు తోచని స్థితిలో పడ్డారు. ఇప్పుడే ఇట్లా ఉంటే, ముందు ముందు ఇక సూర్యుడే గ్రామంలోకి రాని రోజులు ఉంటాయని అందరూ భయపడ్డారు. "నిద్రలేకపోతే ప్రజలకు పిచ్చి పడుతుంది" అని శ్లోకాలు వినబడసాగాయి. ఎవ్వరికీ ఏమీ పాలుపోలేదు.

అట్లాంటి గడ్డు సమయంలో ఆ ఊరి ప్రజలకు ఆశాకిరణంలాగా వచ్చాడు ఒక స్వామీజీ. ఊరి ప్రజలందరూ ఒక్కటై ఆయనకు స్వాగతం చెప్పారు. "మా గ్రామానికి ఏమైందో చెప్పండి స్వామీ" అని వేడుకున్నారు.



స్వామీజీ కళ్లు మూసుకుని కొద్ది సేపు మౌనంగా ఉన్నారు. తన దివ్య చక్షువుతో చూసి, సర్వం గ్రహించారు. కొద్ది సేపటికి ఆయన ముఖం మీద చిరునవ్వు విరిసింది. మెల్లగా కళ్ళు తెరిచారాయన.

"మరేం లేదు నాయనలారా. ఈ గ్రామానికి

విపరీతమైన అరిష్టం ఒకటి పట్టింది. దాని వల్ల దేవతలకు ఈ ఊరిపైన అకారణమైన ద్వేషం కలిగింది; దుష్టశక్తులకు ఊరంతా లోబడింది.

దానికి నివారణ లేకేమి, ఉన్నది- శాస్త్రయుక్తంగా సంకట నివారణ హోమం చెయ్యాలి. లేకపోతే ఊరంతా స్మశానంగా మారుతుంది; అందరూ చనిపోతారు.

అంతటి అరిష్టం ఏదైనా గ్రామానికి చుట్టుకోవటం అన్నది అసలు చాలా అరుదు. మరి ఈ హోమం చాలా ప్రత్యేకమైనది. చాలా డబ్బు ఖర్చుతో కూడుకున్నది- కనీసం లక్ష రూపాయలు అయినా అవుతుంది. అందువల్ల ప్రజలంతా చందాలు వేసుకొని ఈ మొత్తాన్ని సేకరించుకోవాలి. ఆ తర్వాత నాకు తెలియజేస్తే హోమాన్ని ప్రారంభించగలను"

స్వామీజీ మాటను అలా వెలువరించారో లేదో, ప్రజలు చందాలు ఇవ్వటం మొదలు పెట్టారు. హోమానికి ముహూర్తం కూడా నిర్ణయించబడింది అప్పటికప్పుడు.

చీకటి పడింది.. హోమం ఏర్పాట్ల విషయంలో ఊరి సర్పంచికి ఏదో సందేహం కలిగింది- 'ఈ సమయంలో స్వామీజీని కలవచ్చో, లేదో' అని, అనుమానంగానే ఆయన ఉన్న ఇంటి వద్దకు వెళ్ళాడు.

యథాలాపంగా కిటికీలో నుండి లోపలికి తొంగి చూశాడు. చూస్తే ఏముంది?- అక్కడ స్వామీజీ మందు తాగుతూ ఉన్నాడు!



దాంతో గుమ్మడికాయలాగా గుంభనంగా ఉన్న ఊరంతా ఒక్కసారిగా బ్రద్దలైంది! "అతను దొంగ స్వామి" అని తెలిసిన ఊళ్ళో జనాలంతా మహా సముద్రంలాగా అతని మీద పడ్డారు.

చివరికి దొంగ స్వామి అసలు సంగతి

చెప్పాడు: "నేను నెలరోజుల క్రితం ఈ గ్రామానికి వచ్చాను.. ఊరు మొత్తానికీ ఒకే ఒక్క గడియారం ఉందని గమనించాను. ఆ రోజు రాత్రి అందరూ నిద్రపోతున్న సమయంలో నేను పంచాయతీ ఆఫీసు పైకి ఎక్కి, గడియారపు సమయం మార్చాను.

ఆ నాటినుండి ఏ రోజుకారోజు రాత్రిపూట సమయాన్ని నా ఇష్టం వచ్చినట్లు మారుస్తూ పోయాను.

మీరందరూ మూర్ఖులు; నేను ఊహించినట్టే ఈ గడియారంలోని తప్పుడు సమయాన్ని చూసి మోసపోయారు. కళ్లకెదురుగా కనబడే ప్రకృతి సహజమైన సూర్యుడిని కాక, తప్పుడు సమయాన్ని సూచించే కృత్రిమ గడియారాన్ని మరీ అతిగా నమ్మారు. ప్రొద్దున మూడు గంటలకే సూర్యుడు అస్తమిస్తున్నాడని గందరగోళపడ్డారు.

మీ తిక్క కుదరాలంటే, కొంచెం డబ్బు వదలాల్సిందే! అందుకనే నేను వేషం మార్చి, సాధువులాగా ఈ గ్రామానికి వచ్చాను. మీ ఊరిని ఉద్ధరించేందుకు ప్రయత్నించాను.

తప్పు నాది కాదు; మీ అజ్ఞానానిది! అర్థం చేసుకోండి" అని.

అయినా అదేమీ అర్థం కాని జనాలు అతన్ని ఇష్టం వచ్చినట్లుగా కొట్టి, పోలీసులకు అప్పగించారు!



**పేరు నిలిపేవి!**

టీచర్: మన పేరుని చిరస్థాయిగా ఉంచేవి ఏమిటిరా?

స్టూడెంట్: సమాధులు సార్.

*సేకరణ: అళివేలమ్మ, చెన్నేకొత్తపల్లి*

నవ్వు!

**నిజమే చెబుతాను!**

తండ్రి: బిట్టూ! పరీక్షల్లో అన్ని ప్రశ్నలూ రాశానని చెప్పావు గదరా! మరి సున్నా మార్కులు వచ్చాయేం?

బిట్టూ: నేను రాసింది ప్రశ్నలే నాన్నా! వాళ్ళకు జవాబులు కావాలట!

*-ఏడవ తరగతి పిల్లలు, మోడల్ స్కూల్, సికెపల్లి.*

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**కలకత్తా, దక్షిణాఫ్రికా, అరుణముఖుడు, మహాబలుడు, జంబూద్వీపం, చిత్రవర్ణుడు, సుదర్శనుడు, విష్ణుశర్మ, పాణిని, కంపు, నల్లపిల్లి, ఐకమత్యం, అల్లరి, చిరునవ్వు, ఎలుకలు, పుట్టినరోజు, ప్రపంచం, పిట్టలు, వంటకాలు, శ్రవణుడు.** - ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి చూద్దాం!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పా | లు | శ్ర | కం | సు | ద | ర్శ | ను | డు | ఖు | ర్ణ | డు |
| ష్ణ | హా | క | ర్ణ | ట్టి | డు | ణు | వ | శ్ర | జా | ర్శ | ఖు |
| పా | లు | ర్ల | లు | వం | వ్వు | చి | త్ర | ఫ్రి | ణా | ఖు | ము |
| ద | ణి | ర్శ | ల్ల | ఎ | త్ర | ట్టి | త్తా | పి | రి | శ్ర | ణ |
| క్షి | వం | ని | ల్ల | వ | ర్ణ | క | పి | ట్ట | లు | ల్ల | రు |
| శ్ర | ఐ | ట్టి | ర్ణ | ర్మ | ల | ల్లి | జా | లు | క | ఐ | అ |
| ద్వీ | క | డు | త్తా | క | ర్ణ | ద్వీ | రో | ర్మ | శ | వం | పం |
| చం | మ | లు | ద | క | ఐ | ట్టి | న | శ | పు | కం | లు |
| పం | త్యం | బ | సు | క్షి | వ్వు | ణు | ట్టి | ష్ణ | శ్ర | కా | ల్లి |
| ప్ర | పం | హా | ట్టి | వం | ణా | న | పు | వి | ట | వం | పి |
| ట్ట | ణు | మ | త్యం | శ్ర | వ | ఫ్రి | రు | వం | ర్ణ | ద్వీ | ల్ల |
| పం | ద్వీ | బూ | జం | పు | ట్టి | వం | కా | చి | ణి | పు | న |

# పదరంగం-79

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా.*

| 1 | 2 | | 3 | | |
|---|---|---|---|---|---|
| 4 | | ★ | 5 | 6 | |
| 7 | | ★ | | ★ | |
| ★ | ★ | 8 | | | 9 |
| 10 | 11 | | | ★ | ★ |
| 12 | | | ★ | 13 | |

## అడ్డం

1. ప్రపంచంలోని  అతి పెద్ద ఎడారులలో ఒకటి (6)

4. 'హారము'లో చివరి అక్షరం మాయమైంది  (2)

5. వరుస తప్పిన 'పిలుపు' (3)

7. మొదటి రెండు అక్షరాలూ లేని దమయంతి (2)

8. అటునుండి వచ్చిన 'అనుబంధం' (4)

10. 'ఆంధ్రా షేక్స్‌పియర్' పానుగంటి లక్ష్మీనరసింహ రావు గారి ఇంటి పేరు? (4)

12. అక్షరాల వరుస తప్పిన 'సుమము' (3)

13. చక్కిలిగిలి పెడితే వచ్చేది (2)

## నిలువు:

1.'సాయం! హెల్ప్! (3)

2. కర్పూరంతో దేవుడికి ఇచ్చేది (3)

3. 'ఎక్కడి వెలుగు బండి టిక్కెట్టు?' లో దాక్కున్న జంతువు! (5)

6. తిరగబడిన 'పుడా' (2)

8. తలక్రిందులైన 'సువాసన'(3)

9. 'అలిపిరి' క్రింది నుండి పైకి వెళ్లింది (4)

10. 'సర్పం' వాడుక భాషలో ఇలా అంటాం (2)

11. 'మనుచరిత్ర' లోని 'మను' తలక్రిందులయ్యింది (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై  రాసి, మాకు అందేట్లు పంపండి.  మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల  ఫోను నంబరు  తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 81 ని  బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా - 515101

# తెలుసుకుందాం!

వార్తల్లో అంశం

## ఎద్దు మాంసం

అమెరికా, బ్రెసిల్, చైనాలతో సహా అనేక దేశాల్లో ఎద్దు మాంసానికి విపరీతమైన గిరాకీ ఉంది. ఈనాడు ప్రపంచం తినే మాంసాల్లో మూడోవంతు ఎద్దుమాంసమేనట. ఎద్దుమాంసాన్ని ఎగుమతి చేసే దేశాల్లో మన దేశానిది రెండవ స్థానం.



మన దేశ జనాభాలో 75% మంది హిందువులు: ఆవును పవిత్రంగా భావిస్తారు; ఆవుకు పూజలు చేస్తారు. హిందువుల్లో ఉన్నత కులాల వారు అనేకమంది ఎద్దు మాంసాన్ని తినరు. అంతేకాక, ఎద్దు మాంసం తినే కులాలవారిని వారు చిన్నచూపు చూస్తారు కూడా. ఆ విధంగా ఎద్దుమాంసం ఎవరో కొందరి ఆహారపు అలవాటుగా మిగిలిపోక, మతానికి-కులానికి- సమాజంలో వేరు వేరు వర్గాల మధ్య ఉన్న సంబంధాలకు, రాజకీయాలకు చెందిన సున్నితమైన అంశంగా విస్తరించింది.

చాలా ఏళ్ల క్రితం, 1856 లో 'సిపాయిల తిరుగుబాటు'కు ప్రేరణనిచ్చింది ఎద్దుమాంసం. ఆ రోజుల్లో సిపాయిలకోసం లార్డ్ కానింగ్ కొత్తరకం తుపాకులు ప్రవేశపెట్టాడు. ఆ తుపాకీగుండ్ల మీది కవర్‌ను పళ్ళతో లాగి పడెయ్యవలసి ఉంటుంది. అయితే ఆ కవర్‌కు ఆవు మాంసం, పంది మాంసం పూశారని భారతీయ సైనికులంతా మండి పడి, బ్రిటిష్ అధికారులపై తిరగబడ్డారు. అలాగనే "మనకు స్వాతంత్ర్యం రాగానే మన ప్రభుత్వం మొట్ట మొదట గోవధ నిషేధ చట్టం అమలు చేస్తుంది" అని గాంధీజీ అనేక సార్లు అన్నాడు.

మన రాజ్యాంగపు ఆదేశ సూత్రాలలో కూడా గోవధ నిషేధం ఉన్నది. అయినా ఈ అంశంపై రాష్ట్ర ప్రభుత్వాలు వేటికవి, తమకు తోచిన విధంగా ప్రవర్తించాయి. దీనిమీదే కాదు, ఆదేశ సూత్రాలలోని అంశాలపైన అన్నింటిపైన ఇదే వైఖరి: అధికారికంగా నిషేధాలు విధించటం తప్ప, ఆ ఆదేశాల అమలుకోసం అవసరమైన సామాజిక పరిస్థితిని కల్పించేందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించింది లేదు.

1976 లోనే మహారాష్ట్రలో గోవధ నిషేధ చట్టం అమల్లోకి వచ్చింది. 2011 లో గుజరాత్ రాష్ట్రం ఆవు

మాంసంతో బాటు ఎద్దుమాంసాన్ని- అమ్మటం-కొనటం-రవాణా చేయటం అన్నిటినీ నిషేధించింది. మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ లలో కూడా గోవధపై నిషేధాలు ఉన్నాయి. కేరళ-గోవా-పశ్చిమ బెంగాల్- ఇంకా ఈశాన్య రాష్ట్రాల్లో వీటిపైన ఎలాంటి ఆంక్షలూ లేవు. ఆంధ్రప్రదేశ్-తెలంగాణాల్లోనైతే 'అనుమతి లేని' ఆవులను-ఎద్దులను కబేళాలకు పంపరాదని నియమం ఉన్నది. అయినా 'ప్రజలని ఈ చట్టాల వెనకనున్న ఉద్దేశాల దిశగా నడిపింపజేసే ప్రయత్నాలేమీ ఎక్కడా కానరావు.

వినరా వినరా నరుడా తెలుసుకోర పామరుడా
గోమాతను నేనేరా నాతో సరి పోలవురా

కల్లా కపటం ఎరుగని గంగి గోవును నేను
ఏది చెప్పినా కాదని ఎదురు చెప్పలేను
పారేసిన గడ్డి తిని బ్రతుకు గడుపుతున్నాను
పరుల సేవకే సర్వం త్యాగం చేస్తున్నాను

కమ్మనైన గుమ్మపాలు కడవలతో ఇస్తున్నా
నా దూడల కాదని మీ కడుపులు నిండిస్తున్నా
వయసుడిగిన నాడు నన్ను కటిక వాని పాల్జేస్తే
ఉసురు కోల్పోయి మీకే ఉపయోగిస్తున్నాను

నా బిడ్డలు భూమి చీల్చి దుక్కి దున్నుతున్నవోయ్
నా ఎరువున పైరు పెరిగి పంట పండుతున్నదోయ్
నా చర్మమే మీ కాలికి చెప్పులుగా మారునోయ్
నా వల్లే ఢంకాలకు నాదం పుట్టించునోయ్

నా కొమ్ములే దువ్వెనలై మీ తల చిక్కులను తీర్చు
నే కల్పించిన విభూది మీ నొసటను రాణించు
నా రాకయే మీ ఇంట్లో శుభములెన్నో కలిగించు
నా చేయూతయే చివరకు వైతరణిని దాటించు

వినరా వినరా నరుడా తెలుసుకోర పామరుడా
గోమాతను నేనేరా నాతో సరి పోలవురా

-గోవుల గోపన్న చిత్రం కోసం కొసరాజు రచన

'ఇప్పుడు గోవధని నిషేధించాల్సిందే' అని కేంద్రం అనటం, వెనువెంటనే ఎద్దుమాంసం తినేవారిపై దాడులు జరగటం- మేధావులు తమకు ప్రభుత్వం ఇచ్చిన అవార్డులను తిరిగి ఇచ్చెయ్యటం- గందరగోళం నడుమ నిర్ణయాలు- ఇలా జరుగుతున్నది.

ఇంతింత చరిత్ర ఉన్నది కాబట్టి, గోవధ నిషేధం గురించి మనందరం కూడా బాగా ఆలోచించాలి. ఇవేమీ చిన్న చిన్న సంగతులు కాదు. సమాజంలో ఎవరికి వాళ్ల ఆహారపు అలవాట్లున్నాయి; ఆహారం ఎప్పుడైనా మనస్సుకు దగ్గరగా ఉంటుంది. ఆహారం గురించిన ఎట్లాంటి నిషేధం వల్లనైనా చాలామంది మనసులు గాయపడతాయి; వాళ్ళకు కష్టం తోస్తుంది- 'మేమెందుకు వినాలి, మీ మాట?' అంటారు వాళ్ళు.

అయితే మరొక విధంగా కూడా చూడాలి. జంతువుల పట్ల దయతో వ్యవహరించటం నాగరికతకు ఒక సూచిక. మనకు సహాయం చేసే జంతువుల్ని మనం తినెయ్యటం ఏమంత గొప్ప పని కాదు కూడాను- ఆవులైనా సరే, ఎద్దులైనా సరే- మరే జంతువులైనా సరే!

ఆలోచిస్తారు కదూ, ఎట్లా చేస్తే మంచిది?

## ఈ భాగవత పద్యం నేర్చుకోండి!

**అడిగెద నని కడువడిఁ జను,**
**నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్**
**వెడవెడ చిడిముడి తడఁబడ,**
**నడు గిడు; నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.**

ఈ పద్యంలో ఎన్ని 'డ'లు ఉన్నాయో చూశారా? ఇది ఒక రకం 'శబ్దాలంకారం'. పద్యంలో ప్రతి పదానికీ తెలుగులో అర్థం ఉంటుంది! మీ తెలుగు అయ్యవారిని అడిగి తెలుసుకోండి.

"గజేంద్రుడిని మొసలి పట్టుకున్నప్పుడు, దాన్ని కాపాడటం కోసం విష్ణువు పరుగు పెట్టాడట. వెంటనే లక్ష్మి కూడా లేచి ఆయన వెంట పరుగు పెట్టిందట. కానీ ఆయన ఆమెను పట్టించుకోనే లేదు!" ఆ సందర్భంలో వస్తుంది, ఈ పద్యం !

భావం: అప్పుడు ఆ లక్ష్మి తన భర్తను అడగాలనుకున్నది- 'ఎక్కడికి వెళ్ళుతున్నారు, ఎందుకు వెళ్ళుతున్నారు?' అని. అలాగని వేగంగా ముందుకు అడుగులు వేసేది; కానీ మరి అడిగితే ' మాట్లాడకు- వెనక్కి పో!' అంటాడేమో, అని అనుమానంతో అడుగులు ముందుకు పడేవి కాదు- నడక ఆగిపోయేది. అయినా మళ్ళీ తొట్రుపడుతూ మెల్లగా ముందుకే అడుగులు వేసేది; అనుమానంగా మళ్లీ తడబడేది- అట్లా అనుమానంగానే నడుస్తూ పోయింది.








స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) (పోస్టేజి అదనం) |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 11 | 50 | 220 |
| 2 | 2012 Set | 11 | 30 | 220 |
| 3 | 2013 Set | 7 | 25 | 175 |
| 4 | 2014 Set | 10 | 600 | 250 |
| 5 | 2015 Set | 6 | 1400 | 150 |

వివరాలకోసం సంప్రతించండి:

**కొత్తపల్లి ప్రచురణలు**

1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,

చెన్నేకొత్తపల్లి, అనంత పురము జిల్లా- 515101

Phone: 7702877670, 9000453887

Our Bank Account Details:
SB A/c : Kottapalli prachuranalu
A/c No: 62320333310
State Bank Of Hyderabad,
Dharmavaram Branch
IFSC: SBHY0020902

కొత్తపల్లి కథల పుస్తకాలను ఇంటర్నెట్లో పూర్తిగా ఉచితంగా చదవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు!

సందర్శించండి: http://kottapalli.in.        మెయిలు ద్వారా సంప్రతించండి: team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/11/2015 Postal Regn No: HDP/008/2015-2017

ఒక ఊరిలో పెద్ద మర్రి చెట్టు ఉంది. ఒక కాకి ఉంది ఆకాకి దగ్గర చాలా పండ్లు ఉన్నాయి

P. సాయికుమార్
7వతరగతి
PVRZPHS
గుండుపారపల్లె





ఆ చెట్టు దగ్గరే ఒక పిల్లి కూడా ఉంది. ఒక రోజు పిల్లికి చాలా ఆకలి వేసింది. అది కాకి దగ్గరకు వచ్చి

"కాకీ! కాకీ! నాకు కొంచెం పండ్లు ఇస్తావా?" అని అడిగింది అప్పుడు కాకి, "పోయి పండ్లు తెచ్చుకో ఏమి లేవు పో!" అంది. పిల్లికి చాలా బాధ వేసింది కొన్ని రోజుల తరువాత, కాకికి చాలా ఆకలి వేసింది ఇప్పుడు కాకి దగ్గర పండ్లు లేవు.





అది పిల్లి దగ్గరకు వెళ్ళి "పిల్లీ పండ్లు ఇస్తావా?" అని అడిగింది పిల్లి కాకికి సంతోషంగా పండ్లు ఇచ్చింది.

అప్పుడు, అంతకు ముందు తాను పిల్లికి పండ్లు ఇవ్వలేదన్న సంగతి గుర్తుకు వచ్చి, కాకి సిగ్గుతో తలవంచుకుంది.



Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at "Kottapalli", 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.